కూడా అగ్నిగోళంలా వున్నదే కాని తెల్లదనమూ, చల్లదనమూ లేదు. మనిషి మ్రోగించ నవసరం లేకుండా రణదుందుభులు మ్రోగుతున్నాయి. కోకిల కూత చెవికి కటువుగా విన వస్తున్నది. మేఘాలు రక్తమాంసాలు వర్షిస్తున్నాయి. ఉదయసమయంలో మిడుతలదండులు సాగుతున్నాయి. అరుంధతీ నక్షత్రం వసిష్ఠుని అతిక్రమిస్తున్నది రోహిణి నక్షత్రాన్ని శని పీడిస్తున్నాడు. కేతువు చిత్తానక్షత్రం నుండి వెనుదిరిగి స్వాతిలో ప్రవేశిస్తున్నాడు. రాహువు పదే పదే సూర్యుని మింగజూస్తున్నాడు. పుష్యమీ తారను ఆక్రమించి ధూమకేతువు అక్కడే ఆగిపోయింది. కుజుడు వక్రించి మఖాప్రవేశం చేశాడు. గురుడు శ్రవణంలో వున్నాడు. శుక్రుడు పూర్వాభాద్రలో, శని పూర్వఫల్గుణిలో వున్నారు.

నాయనా! ఆవు కడుపున గాడిదపిల్ల పుడుతున్నది. గోగణాలు తలలువంచి రోదిస్తున్నాయి. గుర్రాలు, ఆవుదూడలనూ, కుక్కలు నక్కపిల్లలనూ పెడుతున్నాయి. గ్రద్దల తలలమీద కొమ్ములు మొలుస్తున్నాయి. పెద్ద పెద్ద చెట్లమీద కలువపూలు వికసిస్తున్నాయి. భూమి కంపిస్తున్నది. ఆవుల పొదుగులనుండి రక్తధారలు స్రవిస్తున్నాయి. పక్షులన్నీ ఆర్తనాదాలు చేస్తున్నాయి. కన్నతల్లినే కొడుకులు కామిస్తున్నారు.

సప్తర్షిమండలం కాంతి హీనంగా వుంది. త్రయోదశినాడే సూర్య గ్రహణం వస్తున్నది. అశ్విన్యాది రేవతీపర్యంతం తొమ్మిదేసి నక్షత్రాలను మూడు భాగాలు చేసి మొదటిదానిని అశ్వపతి ఛత్రమనీ, రెండవదానిని గజపతి ఛత్రమనీ, మూడవదానిని నరపతి ఛత్రమనీ వ్యవహరిస్తారు. వీటిని పాపగ్రహాలు ఆచ్ఛాదిస్తే క్షత్రియ వీర నాశనం జరుగుతుందని వేత్తలు చెపుతున్నారు. సాధారణంగా ఒక తిథి ఏమ్యమయితే పధ్నాలుగున అమావాస్య వచ్చినట్లే, తిథివృద్ధి అయితే పదహారున అమావాస్య వస్తుంది అలా వృద్ధి జరిగిన మాసంలో పదమూడవనాడు గ్రహణం వస్తున్నది. పదమూడురోజుల వ్యవధిలో సూర్య చంద్రగ్రహణాలు రావడం యింతవరకూ జరుగలేదు. సముద్రపునీరు ఎర్రగా మారుతున్నది. నూతుల్లో నురుగు పుడుతున్నది. సముద్రుడు చెలియలికట్ట దాటబోతున్నాడు. ఇవన్నీ ఉపద్రవసూచకాలే.

తెల్లవారితే కురుక్షేత్రంలో మారణహోమం ప్రారంభం కానున్నది. నువ్వు గట్టిగా పూనుకుంటే ఈ ప్రమాదం తప్పుతుంది. ధర్మమార్గాన నీ కొడుకులు నడిచేటట్టు చూడు. పాపపంకిలంలోకి నీతోపాటు వీరందరినీ లాక్కుపోకు. పాండవులు కోరినట్లు వారి రాజ్యభాగం వారికిచ్చి సుఖంగా ఉండు, అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు: మహర్షీ! నువ్వు వాస్తవమే చెప్పావు. నాయందు ప్రసన్నభావంతో వుండు. నా కొడుకులు నామాట వినే దశ దాటిపోయింది. నా బుద్ధి ధర్మాన్నే

ఆశ్రయించి వుంది. ఒక్కమాట చెప్పు! యుద్ధంలో విజయం చేకూరే వారికి గోచరించే శుభా శుభాలేమిటి - అన్నాడు.

నాయనా! పొగలు క్రమ్మకుండా అగ్నిజ్వాలలు నిర్మలంగా దక్షిణావర్తంగా ప్రదక్షిణిస్తూంటాయి. అగ్ని కుండంలో వ్రేల్చే ఆజ్యాహుతులు సువాసనలతో నింపుతాయి. చిలకలూ, గోరువంకలూ కిలస్వనంతో ఏ పక్షాన తిరుగుతాయో వారినే విజయలక్ష్మి వరిస్తుంది. మత్తేభాల ఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ నిరంతరం వినిపించే పక్షం జయ శ్రీని ఆహ్వానిస్తుంది. సేనాసంఖ్య ఎంతగా వున్నా, ఉత్సాహ, సాహసాలు లేకపోతే పరాజయం తప్పదు. అసలు సామ, దానాలతో విజయం పొందడం ఉత్తమమార్గం, భేదనీతి వున్నదే ఆది మధ్యమం, యుద్ధం ఎప్పుడూ అధమమార్గమే. ఇక యుద్ధంలో జయాపజయాలను ధర్మం నిర్ణయిస్తుంది. అంతే .... అని వ్యాసుడు క్షణం ఆగి, మళ్ళీ నాయనా! మారణహోమం చూడాలనే కోరిక వున్నదా? - అని అడిగాడు.

ధృతరాష్ట్రుడు తన పుత్ర పౌత్రుల మరణం చూడలేనన్నాడు. అయితే ఎప్పటికప్పుడు యుద్ధవిశేషాలన్నీ నీకు సంజయుడు వివరిస్తాడు యుద్ధ వేళల ఎవరి మనసులు ఎలా నడుస్తున్నదీ గ్రహించే శక్తి కూడా వానికి అనుగ్రహిస్తున్నాను - అని ఆయన నిష్క్రమించాడు.

## భూగోళ వివరాలు

అప్పుడు ధృతరాష్ట్రుడు - సంజయా! ఈ రాజులందరూ నిరంతరం పోరాటం సాగించేది ఈ భూమికోసం కదా. ఈ భూగోళంలో ఏ ఏ విషయాలున్నాయనీ, ఏ విశేషాలున్నాయని వీరు చావుకి తెగించి యుద్ధాలు సాగిస్తారో చెప్పు - అనగా సంజయుడు :

మహారాజా! ఈ భూమి మీది ప్రాణికోటీ వస్తుజాలమూ అంతా పంచభూతాత్మకమయినది. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనేది దీని క్రమం. ఇందులో జంగమాలనీ స్థావరాలనీ మళ్ళీ యివి రెండు విధాలు. అండజ, స్వేదజ, జరాయుజాలని జంగమ ప్రాణికోటి మూడురకాలు. జరాయుజాలలో మళ్ళీ గ్రామాలలో వుండేవి ఏడు, అరణ్యాలలో వుండేవి ఏడు .... ఆవు, మేక, గొర్రె, గుర్రం, గాడిద, కుక్క, మనిషి — ఇవి గ్రామప్రాణులు. సింహ, వ్యాఘ్ర, వరాహ, మహిష, గజ, భల్లూక, వానరజాతులు అరణ్యానికి చెందినవి. ఈ భూమిని పాలించేవారే వీటన్నిటికీ అధికారులు. అప్పట్టి స్థావరాల విషయం - చెట్లు, పొదలు, లతలు, త్వక్సారాలు, గడ్డిజాతులు అని అయిదు విధాలు

అవి పదునాలుగూ, ఇవి అయిదూ వీటితో పంచమహాభూతాలనూ కలిపితే యిరువది నాలుగు. ఈ యిరువది నాలుగు మహా భూతాలనూ గాయత్రీ మహా మంత్రాక్షరా లంటున్నారు.

ఇక పంచ భూతాలలో - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు గుణాలు, భూమికి అయిదుగుణాలూ వున్నాయి. నీటికి గంధ గుణంలేదు. అగ్నిలో శబ్ద, స్పర్శ, రూపాలే వున్నాయి. గాలికి శబ్ద, స్పర్శలూ, ఆకాశానికి శబ్దమూ వున్నాయి. సాధారణంగా ఈ అయిదూ విడివిడిగా వుంటాయి. విషమ పరిస్థితిలోనే యివి కలుస్తాయి. అప్పుడే ప్రాణికోటి ఆవిర్భవిస్తుంది. అవి విడిపోయినప్పుడు యీ ప్రాణి నష్టమవుతుంది. ఇదే సృష్టి క్రమం.

మహారాజా! ఈ ప్రపంచానికి మధ్యభాగంలో మేరు పర్వత మున్నది. ఎనభైనాలుగు యోజనాల ఎత్తున, పదహారువేల యోజనాల కైవారంతో వున్న దానిచుట్టూ భద్రాశ్వ, కేతు మాల జంబుద్వీపా లున్నాయి. ఆ ప్రాంతాలకు ఒకనాడు గరుత్మంతుని కుమారుడు సుము ఖుడు వచ్చాడు. ఆకాశంలో బంగారు రెక్కలతో ఎగిరే కాకులు కనిపించాయి. దానితో యిక్కడ ఉత్తమ మధ్యమాధమ భేదం లేకుండా అన్నీ సమానంగానే వున్నట్టు కనిపించి, తన కక్కడ విహరించడం యిష్టంలేక వెళ్ళిపోయాడు.

అటువంటి సర్వ సమానత్వం అక్కడ అన్ని ప్రాణులలోనూ వున్నది. సూర్య, చంద్ర, తారాగ్రహాలన్నీ దానిచుట్టూ ప్రదక్షిణం చేస్తాయి. ఆ కొండ శిఖరాలమీద దేవ, దానవ, గంధర్వాది గణాలు విహరిస్తుంటాయి. కుబేరుని సంపద అంతా మేరువులో నాలుగో వంతు. ఆయన సంపదలో పదహారోభాగం మానవజాతికి లభించింది. మేరువుకి పశ్చిమంగా కేతుమాల ద్వీపందగ్గర జంబూఖండంలోని మానవులు పదివేల సంవత్సరాలు ఆయుర్దాయంతో బంగారుకాంతిగల దేహాలతో వుంటారు. గందమాధన సమీపంలోని ప్రాణులు పదకొండు వేల సంవత్సరాలు జీవిస్తాయి. కైలాసంగా పేరుపడ్డ హేమ కూటంమీద కుబేరుడుంటాడు. ఆయనకు ఉత్తరంగా మైనాకమూ, హిరణ్య శృంగమూ, దాని సమీపంలో బిందుసరమూ వున్నాయి ఇక్కడే భగీరథుడు గంగకోసం తపస్సు చేశాడు.

నీలగిరికి దక్షిణంగా సుదర్శనం అనే పేరుతో విఖ్యాతమైన జంబూవృక్షం వున్నది. దానివల్లనే దీనికి జంబూద్వీపం అనే పేరు వచ్చింది. ఈ జంబూఫల రసం పుచ్చుకున్న వారికి ఆయురారోగ్యాలు వృద్ధి పొందుతాయి.

ఇక ఈ భారతవర్షం ఉన్నదే. దీన్ని పృథువు, ఇక్ష్వాకువు, యయాతి, మాంధాత, అంబరీషుడు, శిబి, పురూరవుడు, దిలీపుడు, గాధి ఆదిగాగల వారెందరో పాలించారు. ఇక్కడే మలయ, మహేంద్ర, సహ్య, శక్తిమంత, ఋక్షవంత, వింధ్య గంధమాదనాది

అసంఖ్యాక పర్వత శ్రేణు లున్నాయి. గంగా, సింధు, సరస్వతీ, గోదావరీ, యమున, నర్మద, బాహుద, శతద్రు, చంద్రభాగ, కృష్ణ, వేదవతీ, కావేరీ, శతబల ఆదిగాగల నదులెన్నో వున్నాయి. జనపదాలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి.

రాజలోకమంతా ఈ భూమండలం కోసం పోరాటం సాగిస్తున్నది. కృతయుగంలో మానవుడు నాలుగువేల సంవత్సరాలు, త్రేతాయుగంలో మూడువేల ఏళ్ళు, ద్వాపరంలో రెండువేల వర్షాలూ జీవిస్తాడు. కలియుగంలో మనిషి ఆయుర్దాయానికి ఒక లెక్కలేదు. గర్భంలోనే కొందరు మరణిస్తారు. కొందరు భూమిమీద పడిన క్షణాలలో ఊపిరి విడిచేస్తారు. కొందరు నూరేళ్ళు దాటి బ్రతకవచ్చు. కృతయుగంలో సత్య వ్రత పరాయణులూ, బలిష్ఠులూ, గుణవంతులూ ఉద్భవిస్తారు. వారి సంతానం వేలసంఖ్యలో వుంటుంది. త్రేతాయుగంలో మానధనులూ, ధార్మికులూ, పౌరుషజీవనులూ వుంటారు. ద్వాపరంలో అన్నివర్ణాల వారూ యుద్ధ వాంఛతో జీవిస్తారు. కలి యుగంలో అల్ప బలులూ, ఆవేశ పూరితులూ, అసత్య వాదులూ, లోభ గ్రస్త హృదయులూ ప్రభవిస్తారు. దురభిమానులు ఎక్కువగా వుంటారు. ఈర్ష్య వారికిజన్మ లక్షణం. వీరిలో లేని దోషాలు లేవు. ద్వాపరంలోనే ఈ దోషాలు కొంత పొడసూపుతాయి. వాటి విశృంఖల విజృంభణ కలియుగంలో కనిపిస్తుంది — అని వివరించి సంజయుడు యుద్ధభూమికి వెళ్ళాడు.

యుద్ధభూమినుండి ఒకనాడు తిరిగి వచ్చిన సంజయుడు, దీనవదనంతో గద్గద స్వరంతో —

మహారాజా! హిమాచలం వలె స్థిరమయిన ధీశక్తి గల, సముద్రమంత గంభీర మయిన హృదయంకల, భూదేవికున్నంత ఓర్పుగల, పరశురాముని వంటి ధనుర్ధరుని నిలిపిన యోధసింహుడు భీష్మాచార్యులు శరతల్పంమీద వున్నాడు. మృగరాజును చూసినంతలోనే పలాయనం సాగించే ఆవులమంద వలె ఈ భీష్ములవారిని చూసి పాండవసేనలు చెల్లాచెద రయేవి. అలా ఆయన పదిరోజులు మన సేనకు రక్షకుడుగా వున్నాడు. వేలమంది యోధు లను అలసట లేకుండా నేల కూల్చిన ఆ మహావీరుడు ఝంఝూ మారుతంలో మహా వృక్షంలా యుద్ధభూమిలో నేలకూలాడు. మీ రింతవరకూ సాగించిన కపట వ్యవహారమే దీనికి కారణం, కాదంటారా! ఆలోచించండి! పాంచాలుడయిన శిఖండి చేతులలో ఆయన పడిపోయాడు - అని తలవాల్చుకున్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు — సంజయా! ఏమన్నావు! మహాజ్ఞాని, ధనుర్వేద విదుడూ, వీరాగ్రేసరుడూ, పరశురామ శిష్యుడూ కురుకులభూషణుడు నేలకూలినాడంటే నా హృదయం

సంతాపంతో కుమిలి పోతున్నది. ఆయన యుద్ధ భూమిలో సూర్య సమ తేజంతో నిలబడితె శత్రువులు చీకటిరేకలవలె పలాయనం పఠించాలె.

యుద్ధసమయాన సేనాగ్రభాగంలో ఎవరున్నారు? ఆయన వెంట వున్న వారెవరు? పార్శ్వరక్షకు లెవరు? అస్త్రాచార్యుడయిన ద్రోణుల వారుండగా కృపాచార్యుల సమక్షంలో భీష్ములవారు శిఖండి చేతులలో నేలకూలడమా! అంటే శస్త్రాస్త్రాలూ, ధీశక్తి, త్యాగబుద్ధి యివేవి కాలాన్ని జయించలేవనీ కాలమే బలీయమయినదనీ విశ్వసించక తప్పదు. ఈ క్షణం వరకూ ఆయనమీదనే నా ఆశలన్నీ వున్నాయి. ఇంక నాకు విజయంమీద ఆశ లేదు నా హృదయాని కింక శాంతిలేదు. అసలు యీ పదిరోజులూ జరిగిన యుద్ధంలో ఆయన ఏ ఏ వ్యూహాలు పన్నినాడో, యోధు లెవరెవరు మరణించారో అన్నీ వివరంగా చెప్పు అన్నాడు.

మహారాజా! మీరు భావించినట్లు కాలం బలీయమయినది. దాని ప్రేరణతోనే యి మానవ సంఘం నడుస్తున్నది. ఇప్పుడు ఏ ఒక్కరిని దోషులుగా భావించ నవసరం లేదు వ్యాసుల వారు అనుగ్రహించిన దివ్య దృష్టితో నేను ఎక్కడ వున్నా యుద్ధరంగంలో ఏ మూల ఏం జరిగిందీ ఎవరి మనస్సులు ఏ రీతిలో సాగినదీ గ్రహించ గలిగినాను. అదంతా తమకు వివరిస్తాను.

తెల తెలవారుతుండగానే శంఖ, భేరీధ్వానాలు మిన్ను ముట్టాయి. రథ, గజ, తురగ దళాలు యుద్ధాలంకరణ పూర్తిచేసుకుంటున్నాయి. వీరుల సింహ గర్జనలు, అశ్వాల హేషా రవాలు, మత్తేభ ఘీంకారాలు, మహెూత్సాహంగా సేనలను నడుపు తున్నాయి. కురుక్షేత్రం రణరంగంలా కాక ఒక సంగ్రామ నగరశోభతో వుంది. మన పదకొండు అక్షౌహిణీలసేనకు అగ్రభాగంలో భీష్ములవారు నిలబడ్డారు. రజతమయరథం, దానికి పూన్చిన అశ్వాలు ధవళ కాంతులతో వున్నాయి. ఆయన తలపాగా కూడా శ్వేతవర్ణంతోనే భాసిస్తున్నది. ఆయన రథధ్వజం తాళచిహ్నమై గగనసీమలో ధగధగ లీనుతున్నది. చంద్రమండలంలా వున్నా డాయన.

ఆ సమయంలో సుయోధనుడు దుశ్శాసనుని పిలిచి: సోదరా! మనమిప్పుడు పితామహులను రక్షించు కోవాలి. యోధులందరూ ఆయనను పరివేష్టించి వుండాలి. ఒక్క శిఖండిని మాత్రమే ఆయన చూడడు. ఈ విషయం మనం విస్మరించి, ప్రమత్తుల మయితే నిర్లక్ష్యంగా వున్న, సింహాన్ని కుందేలు పరాభూతం చేసినట్లు ఈ మహావీరుడు శిఖండి చేతులలో పడి పోతాడు - అని హెచ్చరించాడు.

అంతా సిద్ధమయాక గాంగేయుడు —

క్షత్రియవీరులారా! మనందరికీ స్వర్గద్వారాలు తెరచి ఉంచుతారు. శౌర్య, ధైర్యాలు ప్రదర్శించి మన తండ్రి, తాతలు ఈ వీరధర్మానుయాయులై బ్రహ్మ లోకాలు చేరారు. మనమూ ఆ దారినే నడవాలి. రోగ పీడతో మంచాల మీద కృశించి, నశించడం క్షత్రియుడికి ఉచితం కాదు. రణరంగంలోనే అంతిమ శ్వాస .... ఇక మీ మీ ధైర్య సాహసాలు ప్రదర్శించండి .... అని ప్రబోధించాడు.

మహారాజా! ఉదయసూర్యుని కాంతులే చండ ప్రచండంగా సోకుతున్నాయి. నక్కలూ, కాకులూ అమంగళధ్వానాలు చేస్తున్నాయి. ఎటుచూచినా మానవ జాతికి మహా విపత్తు రానున్న లక్షణాలే కనిపిస్తున్నాయి.

అటూ, యిటూ దుశ్శాసన, దుర్విషహ, దుర్ముఖ, దుస్సహ, వివింశతి, వికర్ణ, చిత్రసేన, సత్యవ్రత, పురుమిత్ర, భూరిశ్రవ, జయ, శలాదులు యిరవైవేల సైన్యంతో భీష్మునివెంట వున్నారు. అభిషాహ, శూరసేన, వసాతి, శాల్వ, త్రిగర్త, కేకయ, సౌవీర దేశాల అధిపతులూ, వారి రథ బలమూ పితామహుని రక్షణలో వున్నాయి. రథ చక్రరక్షకులూ, గజపాదరక్షకులూ, పదాతిదళమూ వేలసంఖ్యలో ఆయన వెంట వున్నది.

అప్పు డాయన ద్రోణ, కృప, బాహ్లిక, అశ్వత్థామలతో సంప్రదించి సర్వతోముఖ వ్యూహాన్ని పన్నాడు. గజబలం అంగంగా, రాజలోకం శిరస్సుగా, అశ్వికదళం రెక్కలుగా రూపొందించాడు.

కర్ణుడూ, వాని బంధుగణమూ రణరంగానికి దూరంగా వుండిపోయింది — అని సంజయుడు చెప్పగా

ధృతరాష్ట్రుడు: సంజయా! భీష్ములవారు పన్నిన వ్యూహాన్ని ఛేదించడానికి ధర్మ రాజు పన్నిన ప్రతివ్యూహం ఎలా వుంది, అని అడిగాడు.

మహారాజా! ఆ సమయంలో ధర్మరాజు అర్జునుని పిలిచి: తమ్ముడూ! శత్రుసేన అధికసంఖ్యలో వున్నప్పుడు మనసేన స్వల్పంగా వుంది కనుక .... సూచీవ్యూహంలో వుండాలని బృహస్పతి మతం. అందుచేత మనసేనను అలా నడిపించు, అనగా అర్జునుడు:

ధర్మనందనా! మనం వజ్రవ్యూహం పన్నాలిప్పుడు. అది శత్రుదుర్భేద్యంగా సాగుతుంది. భీమసేనుడు అగ్రభాగంలో వుంటాడు. సింహాన్ని చూసిన అల్పమృగాలవలె భీమసేనుని చూసి కౌరవసేన చెల్లాచెదరవుతుంది. లోహ మయమయిన గదాదండంతో భీమ సేనుడు భీకర గర్జనలు చేస్తూ సాగుతూంటే గజగజలాడుతాయి వారి సేనలు — అంటూ

వ్యూహనిర్మాణం ఆరంభించాడు. భీముడు అగ్రభాగంలో నిలిచేసరికి వారందరి ఉత్సాహమూ మిన్నుముట్టింది. నకుల, సహదేవులు పార్శ్వరక్షకులుగా, విరాటరాజు అక్షౌహిణి సేనతో వెనకనే వున్నారు. ధృష్టద్యుమ్నుడు తన పాంచాలయోధులతో ప్రభద్రకగణం వీరందరికీ రక్షకుడుగా వస్తున్నాడు. వీరి వెనుక అర్జున సహాయంతో శిఖండి మహాసైన్యంతో వస్తున్నాడు. ఆ వెనుక సాత్యకి, యుధామన్యువూ, వారివెంట మిగిలిన సేనా సమూహమూ నిలిచింది.

అందరూ ప్రాతఃకాలంలో సంధ్యను ఉపాసించి వచ్చారు. ఆకాశంలో మేఘం లేకుండా వాన, దానివెంట గాలీ సాగివచ్చాయి. ఒక్కసారి అంధకారం వ్యాపించింది. పూర్వ దిశలో ఒక ఉల్క సూర్య మండలాన్ని ఢీకొని చెల్లాచెదరయి పడింది. అంత సూర్యకాంతి క్షీణించింది. అన్ని దిక్కుల నుండీ పిడుగుల ధ్వనులు వ్యాపించాయి - అంటుండగా, ధృతరాష్ట్రుడు :

సంజయా! ఆ సుప్రభాతవేళ మన సేనలు ఆనందంగా వున్నాయా? వారి సైనికుల ముఖాలలో ఆనందం, ఉత్సాహం గోచరించిందా? అని అడిగాడు.

మహారాజా! మనసేన దైత్యసేనాసమూహంలా వుంటే, వారి బలం దేవసేనలా వుంది. వారికంటె మనది సంఖ్యలో చాలా పెద్దది మన సేనా సాగరాన్ని చూసిన ధర్మరాజు - అర్జునా! పితామహుల రక్షణలో అసంఖ్యాక బలంతో వచ్చే ప్రతిపక్షాన్ని మనం ఎదుర్కొనగలమా — అనడంతో

అర్జునుడు : ధర్మనందనా! ఇదివరలో ఒకనాడు అసురులు అసంఖ్యాకబలంతో దేవతలను ఢీకొనవచ్చినపుడు దేవేంద్రుడు భయ భీతుడై చతుర్ముఖ ప్రజాపతి శరణువేడగా ఆయన :

దేవేంద్రా! బల, వీర్య, పరాక్రమ, సంఖ్యాబలాలు విజయ కారణాలు కావు. ధర్మం, సత్యం, ఉత్సాహం యివీ విజయసాధనకు అవశ్యాలు, అన్నాడు. వాటితో ఆసురీ శక్తిని అమరేంద్రుడు జయించాడు. మరొక్క విషయం వుంది. అనంత గుణ సమన్వితుడు వాసుదేవుడు. ఆయనవెంట విజయలక్ష్మి వుంటుంది. ఆయన మనకండగా వుంటాడు. అది చాలు - అన్నాడు.

మహారాజా! గాండీవం ధరించి, అక్షయతూణీరాలతో వచ్చిన అర్జునుడు సజ్జితరథం అధిరోహించాడు. నవ్వు రాజిల్లెడి మోముతో దేవకీ నందనుడు గుర్రాలను అదుపులో వుంచడానికి కళ్ళాలు బిగించాడు.

మనపక్షంలో భీష్ములవారూ, వారిపక్షంలో భీమసేనుడూ సేనాముఖంలో నిలిచారని చెప్పాను గదా!

ఆ సమయంలో వాసుదేవుడు అర్జునునితో :

కిరీటీ! శత్రుసంహార కాంక్షతోవున్న నువ్వు ఒక్కసారి ఆ పరాశక్తిని ధ్యానించు. ఆ ఆదిశక్తి విజయరూపిణి. అనగానే అర్జునుడు, అర్ధనిమీలిత నేత్రుడై:

నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందారవాసిని
కుమారి కాళి కాపాలి కపిలే కృష్ణపింగళే
భద్రకాళి నమస్తుభ్యం మహాకాళి నమోస్తు తే
చండి చండే నమస్తుభ్యం తారిణి వరవర్ణిని
కాత్యాయని మహాభాగే కరాళి విజయే జయే
శిఖి పింఛ ధ్వజధరే నానాభరణ భూషితే

వేదశ్రుతి మహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి
జంబూకటక చైత్యేషు నిత్యం సన్నిహితాలయే

స్వాహాకారః స్వధాచైవ కళా కాష్ఠా సరస్వతీ
సావిత్రీ వేదమాతాచ తథా వేదాంత ఉచ్యతే
స్తుతాసి త్వం మహాదేవి విశుద్ధేనాంతరాత్మనా
జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదాద్రణాజిరే

అని దుర్గను స్తుతించాడు.

## భగవద్గీత

ధృతరాష్ట్ర మహారాజా! ఉభయపక్షాలూ యుద్ధ సన్నద్ధ మయి నిలిచాయి. అప్పుడు సుయోధనుడు ద్రోణాచార్యులను సమీపించి –

ఆచార్యా! పాండవసేన మీ శిష్యుడయిన ధృష్టద్యుమ్నుని నాయకత్వంలో నిర్భయంగా నిలిచింది. భీమార్జునులతో సములయిన విరాట, ద్రుపద, చేకితాన, ధృష్టకేతు, శైబ్య. కుంతిభోజులూ, యుధామన్యువూ, ఉత్తమౌజుడూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ మహారథికులే. ఇక మన సేనలో మీరూ, పితామహులూ, కృపాచార్యులూ, కర్ణుడూ,

అశ్వత్థామా, వికర్ణుడూ, భూరిశ్రవసుడూ వున్నారు. మీరంతా నా కోసం ప్రాణమ త్యాగం చెయ్యడానికి సిద్ధంగా వున్నవారే. అయితే మనమందరం ఇప్పుడు భీష్ములవ సంరక్షించుకోవాలి-అని అంటూండగా భీష్ములు శంఖం పూరించాడు అంతతో మన లందరూ శంఖ భేరీధ్వానా లారంభించారు.

తెలని గుర్రాలను పూన్చిన రథంమీద వచ్చే కృష్ణార్జునులు పాంచజన్య దేవ లను పూరించాడు. భీమసేనుడు పౌండ్ర శంఖాన్ని, నకుల, సహదేవులు సుఘోష. పుష్పకాలనూ పూరించారు. అంతతో వారి పక్షాన గల యోధులందరి శంఖ ధ్వానా మిన్నుముట్టాయి అప్పుడు అర్జునుడు — మాధవా! మన రథాన్ని ఉభయసేనా మధ్య నిలుపు. ఒక్కసారి శత్రుసేనలో ఎవరెవరున్నారో చూస్తాను - అన్నాడు.

ఎదురుగా పితృసములూ, పితామహులూ, ఆచార్యులూ, మేనమామలూ, సో రులూ, పుత్రతుల్యులూ, పౌత్రులూ, స్నేహితులూ కనిపించడంతో కన్నుల నీరు తిరిగి-

కృష్ణా! వీరిని చూస్తూంటే నా శరీరం గగుర్పాటుతో కంపిస్తున్నది. నాలుక పి కడుతున్నది. మనస్సు వికలమవుతోంది. గాండీవం చెయ్యి జారుతోంది. బంధు, సోద సుహృజ్జనాన్ని సంహరించి విజయం పొంది, రాజ్యభోగాలు అనుభవించా లనిపించడంలే పితామహులు, ఆచార్యులు, సోదరులు, స్నేహితులు వీరితోనా యుద్ధం. నా మనస్సం రించడం లేదు. నేను గాండీవం సంధించను. వారే నన్ను సంహరిస్తే నిశ్చింతగా ప్రాణా విడుస్తాను - అని ధనుర్బాణాలు వదిలి రథం మీద కూలబడ్డాడు.

అప్పుడు వాసుదేవుడు: పార్థా! ఈ సమయంలో నీ మనస్సుని ఈ కశ్మలభావా ఎలా ఆవరించాయి? అపకీర్తికరమూ, అనార్యులకు కలుగవలసింది. నీ వంటివాడికి ఊ రాకూడదు. పౌరుషవంతుల ఛాయలోకి రాకూడని క్షుద్రమయిన హృదయ దౌర్బల్యా విడిచి నిలబడు, లే .... అనగా అర్జునుడు - కృష్ణా! ఆచార్యులనూ, పితామహులన సంహరించి యీ నెత్తురుకూడు తినడం కంటె భిక్షాటనం మేలనిపిస్తున్నది. ఇప్పుడు నా ధర్మమేదో అధర్మమేదో తెలియడం లేదు. గురువుగా కర్తవ్యం ఉపదేశించు, అన్నాడు.

అప్పుడు వాసుదేవుడు ఫకాలున నవ్వి — అశోచ్యులకోసం శోకిస్తున్నావు. ఏవే ప్రజ్ఞావాదాలు చేస్తున్నావు. విజ్ఞతకలవారు చెయ్యవలసిన పనికాదు. ఇప్పుడు నువ చూస్తూవ్న వీరందరూ యిదివరలో వున్నారు. ఇప్పుడూ వున్నారు. ఇకముందూ ఉంటార దేహధారికి బాల్య, కౌమార, యౌవనాలవలె మరో దేహం కూడా ప్రాప్తిస్తుంది.

ధీమంతులు ఈ పరిణామాన్ని గుర్తించరు. శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు యివన్నీ జీవునికి సంబంధించినవి కావు. ఈ దేహాలు వాటికి కలిగే సుఖ దుఃఖాలు యివన్నీ అసత్పదార్థాలు. సత్పదార్థం ఆత్మ ఒక్కటే. అదే సద్రూప బ్రహ్మ.

ఈ జగత్తంతా సద్రూప బ్రహ్మ వ్యాప్తమే. అందుచేత బ్రహ్మ రూపమయిన ఆత్మకు నాశనం ఉండదు.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః॥
జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ...
అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత!
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా.... ॥
వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో உపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

అస్త్రశస్త్రాలు ఛేదించలేనిదీ, అగ్ని దహించలేనిదీ, నీటివల్ల ఆర్ద్రం కానిదీ, గాలి వల్ల ఎండిపోనిదీ ఆత్మ.

ఈ భూతమయ దేహం అంటావా! ఆదిలో ఈ పంచభూతాలు లేవు. మధ్యలో వచ్చాయి. మళ్ళీ పోతాయి. వాటి కోసం పరిదేవన దేనికి? చిరిగినబట్టను విడిచి మంచి వస్త్రం ధరించినట్లే ప్రాణి జీర్ణ దేహం విడచి మరో శరీరాన్ని ధరిస్తుంది. ఇంక ఈ ప్రపంచములో జనన — మరణాలు ఒకదాని వెంట ఒకటి వస్తూనే వుంటాయి. అందుకోసం ప్రాజ్ఞుడయిన వాడు విచారించకూడదు. అందుచేత విజయా! —

హతో! వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం।
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥

ఈ సమయంలో నువ్వు యుద్ధసంకల్పం విడిచి పెట్టకు. ఇందులో మరణిస్తే వీరస్వర్గం జయిస్తే భూమండలం సర్వభోగాలతో నీ కాళ్ళ ముందు వుంటుంది. కృత నిశ్చయంతో లేచి నిలబడు. జయాపజయాలకూ సుఖ దుఃఖాలకూ, ఉత్సాహ విషాదాలు పొందకుండా ఆత్మ జ్ఞానంతో సంతుష్టుడైన వాడే స్థితప్రజ్ఞుడు - అనగా, అర్జునుడు - మాధవా! స్థితప్రజ్ఞుల లక్షణాలేమిటి - అని అడిగాడు.

కౌంతేయా! దుఃఖ సన్నివేశాలు మీదపడ్డా కలతచెందని మనస్సు కలవాడ
సుఖ సంతోషాలను వాంఛిస్తూ, తాపత్రయ పడనివాడూ, క్రోధమూ, భయమూ, అనురాగః
లేనివాడూ ఇంద్రియాలకు లొంగకుండా, వాటిని తన ఆధీనంలో వుంచుకొనే వాడే స్థితప్రజ్ఞ

ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూ పజాయతే ।
సంగా త్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥
క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥

నిరంతరం పాంచభౌతిక విషయాలనే మననం చేసుకునే అభ్యాసంవల్ల వాటిమీ ఆసక్తి పుడుతుంది. అక్కడ కోరిక ఉద్భవిస్తుంది. దాని వెంట క్రోధం ఉద్భవిస్తుంది. క్రో వశమయిన మనస్సు అవివేకంలో పడుతుంది. అప్పుడు స్మృతినశించి బుద్ధిహీనత ప్రాప్తిస్తుం అదే మనిషికి నాశనం. అందుచేత మనస్సును భౌతిక విషయాలకు లొంగ నివ్వకూడదు

నిర్మమో, నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి

అహంకార, మమకార శూన్యుడికి శాంతి లభిస్తుంది — అని చెప్పగా, అర్జునుడు

మాధవా! నా మనస్సు మరీ సందిగ్ధలో పడుతున్నది. కర్మకంటె జ్ఞానమే శ్రే మంటూ నన్ను యీ ఘోరకర్మకు ఎందుకు ప్రేరేపిస్తున్నావు - అని అడిగాడు.

గాండీవీ! జ్ఞానార్థులకు జ్ఞాన యోగమూ, నిష్కామ యోగులకు కర్మమార్గమూ ఉప దేశించాను.

అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః ॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం ।
తస్మా త్సర్వ గతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

అన్నం వల్ల ప్రాణికోటి పుడుతున్నది. అన్నం వర్షం వల్ల కలుగుతున్నది. వానలు యజ్ఞాలవల్ల కురుస్తాయి. వాటికి కర్మ మూలం. కర్మకు వేదం మాతృస్థానం. అది అక్షర సముద్భవం పర్యవసానంగా అక్షరరూపమయిన వేదం (బ్రహ్మ) యజ్ఞాలలో ప్రతిష్ఠితమయి వుంటుంది. అది కర్మ చక్రాన్ని నడుపుతుంది. ఫలాపేక్ష లేకుండా కర్మ చెయ్యడమే మోక్ష హేతువు. జనకాది చక్రవర్తులు కూడా ఈ కర్మ మార్గాన్ని విడవకుండానే జ్ఞానులయారు.

శిష్టులయిన వారు ఏ దారిన వెడతారో యితరులు ఆ దారినే అనుసరిస్తారు. వారు సిన దానినే ప్రమాణంగా గ్రహిస్తారు. అందుచేతనే నాకు కావలసిందేమీ లేకపోయినా కం కర్మభ్రష్టం కాకుండా వుండడం కోసం కర్మలు ఆచరిస్తున్నాను. స్వధర్మాన్ని అనుస స్తూ ప్రాణాలు కోలుపోయినా శ్రేయస్కరమే కాని, యితరుల ధర్మాన్ని ఆచరించడం చాలా పమాదకర మయినది.

అర్జునా! ప్రాచీనకాలంలో సూర్యుడికి బోధించిన జ్ఞానమార్గం నీకు చెపుతున్నాను. న్ని సూర్యుడు మనువుకీ, మనువు ఇక్ష్వాకునికీ ఉపదేశించారు - అనగా.

మాధవా! నేటి వాడవయిన నువ్వు సూర్యభగవానుడికి ఏనాడో ఉపదేశించానంటు న్నావు - అంటూండగా వాసుదేవుడు నవ్వి - పార్థా! మనకు ఇప్పటికి ఎన్నో జన్మలు గతించాయి. అయితే ఆ విషయం నీకు తెలీదు. నాకు జనన మరణాలు లేకపోయినా నా మాయతో నేను జన్మిస్తుంటాను.

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదా త్మానం సృజామ్య హమ్॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

ధర్మగ్లాని జరిగినప్పుడల్లా నేను అవతరించి, అధర్మాన్ని అణగార్చి ధర్మోద్ధరణ చేస్తుంటాను. సత్పురుషరక్షణకూ, దుష్టశిక్షణకూ, ధర్మసంస్థాపనకూ నేను అవతరిస్తుంటాను.

ఇక రాగ ద్వేషాలను జయించి, మాత్సర్యరహితులై తాము సాగించే కార్యాలు ఫలించినా, ఫలించకపోయినా పట్టించు కోకుండా వుండేవారు బంధంలో పడరు. అలా వుంటూ ఇంద్రియాలను జయించిన వారు జ్ఞానులవుతారు. అందుచేతనే అజ్ఞాన సంశయాన్ని జ్ఞానఖడ్గంతో ఛేదించి ఫలాపేక్ష లేకుండా కర్మ చెయ్యి - అన్నాడు.

అప్పుడు అర్జునుడు - కృష్ణా! కర్మత్యాగం, కర్మానుష్ఠానం అంటూ రెండూ చెపుతున్నావు. ఏమిటిది - అనగా

కౌంతేయా! కర్మపరిత్యాగమూ నిష్కామ కర్మానుష్ఠానమూ రెండూ ఉత్తమ మార్గాలే. అయితే రెండవదే అనేకులకు అనుసరణీయం. జ్ఞానయోగి పొందే ఫలాన్నే కర్మ యోగికూడ పొందుతాడు. జ్ఞానికి, నిష్కామంగా కర్మసాగించే వాడికీ, భేదం లేదు. ఎందు కంటే ఉభయులూ సమాన ఫలమే పొందుతారు.

నిరంతరం బ్రహ్మమందే దృష్టినిలిపి, మోహాలకు లొంగనివాడు బ్రహ్మపద పొందుతాడు. బాహ్యవిషయాలపై ఆలోచనలు పోనివ్వక భ్రూమధ్యంలో దృష్టిని ఏకాగ్రంచే మనో, బుద్ధులనూ, ఇంద్రియాలనూ స్వాధీనం చేసుకున్న జ్ఞానికి మోక్షం కరతలామలక మట్టినీ, బంగారాన్నీ, సమానంగా చూడగలవాడు జితేంద్రియుడై యోగారూఢు డవుతాడ

వాసుదేవుడు గీతోపదేశం కొనసాగిస్తూ —

పార్థా! ఆత్మజ్ఞానం కోరేవాడు వెయ్యిమందిలో ఒకడుంటాడు. వారిలో ఏ ఒక నన్ను తెలుసుకో గలుగుతాడు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనసు బుద్ధి, అహంకారము అనే ఎనిమిది రూపాలలో మాయ కనిపిస్తూ ఉంటుంది. అదే సంసా బంధ హేతువు.

తద్భిన్నమూ, శ్రేష్ఠమూ, అయిన నా శక్తి జీవరూపంలో వున్న ఈ జగత్తు ధరిస్తున్నది. దారంలో పూసల వలె ఈ జగత్తు నా మీద ఆధార పడింది. జలమందు ర స్వరూపంలో, సూర్య చంద్రులలో కాంతిగా, వేదాలలో ప్రణవంగా, ఆకాశంలో శబ్దంగ మానవునిలో పురుషకారంగా, భూమిలో గంధరూపంగా, అగ్నియందు తేజస్సుగా, జీవకోటిక ప్రాణవాయువుగా వున్నది నేనే. సత్త్వ, రజ, స్తమోగుణాలు నేనే. ఇది గ్రహించిన వాడ బ్రహ్మ జ్ఞాని. యోగ మాయా వృతుడనై నేను ఈ లోకానికి కనిపించకుండా ఉంటాను.

ఇంద్రియ నిగ్రహంతో నవద్వారాలూ బంధించి, మనస్సును హృదయాన్నీ నిర ధించి, ప్రాణాన్ని సహస్రారంలో నిలిపి, ధ్యానయోగంలో నన్నే స్మరిస్తూ ఓంకారోపాసనతో జీవితం సాగించేవాడు నన్ను పొందుతాడు. ఇక వానికి పునర్జన్మ లేదు. ఈ భూతకోట ఎన్నోమారులు ప్రభవించి లయ మవుతూంటుంది. వీటికి అతీతమైంది పరబ్రహ్మం. యోగ భ్యాసం చేసేవాడు ఏ కర్మలూ చెయ్యకుండానే ఈ బ్రహ్మపదం పొందగలడు.

సర్వత్రా వ్యాపించి, సంచరించే వాయువు ఆకాశంలో వున్నా దానిని అంటనట్టు ఈ జగత్తంతా వ్యాపించివున్న నాకు దానితో ఏ బంధమూలేదు. ప్రళయ సమయంలో ఇవన్నీ నాలో లయమవుతాయి. ఈ విషయం తెలిసిన బ్రహ్మజ్ఞానులు నన్నే ఆశ్రయిస్తారు. అజ్ఞానుల ఈ విషయాన్ని గ్రహించలేక మోహ పాశ బద్ధులై తామస, రాజస స్వభావాలతో నన్ను అపహసిస్తారు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్॥
అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

ఇతర చింతలేమీలేకుండా నన్నే ఉపాసిస్తూ భక్తితో పత్రమో, పుష్పమో, ఫలమో, లమో, నాకర్పించేవారి క్షేమం నేనే చూస్తాను. నువ్వు చేసే పనినీ, తినే ఆహారాన్నీ సే హోమాన్ని, దానాన్నీ తపస్సునూ నాకే అర్పించు. అప్పుడు నన్ను చేరగలవు ర్వభూతాలయందూ నాకు సమభావమే వుంది.

నేనే విష్ణువును, సూర్యుడను, చంద్రుడను.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా॥

ఇంతదేనికి! స్థావర జంగమాత్మక భూతకోటి అంతా నేనే. నాలోని ఒక్క అంశతో ఈ సర్వప్రపంచం నిండి వున్నది. అంటూండగా.

కిరీటి, మాధవా! నీ మాటలు వింటూంటే నా మోహాంధకారం పటాపంచలయింది. ఒక్కసారి నీ స్వరూపంతో నాకు సాక్షాత్కరించు అన్నాడు.

అర్జునా! చూడు, ఈ నిఖిల ప్రపంచాన్నీ నాలో చూడడానికి నీకు దివ్యదృష్టి అనుగ్రహిస్తున్నాను. నీ చర్మచక్షువులకు ఆ శక్తిలేదు - అని విశ్వరూపం ధరించాడు వాసుదేవుడు.

అనేక వక్త్రనయనం అనేకాద్భుతదర్శనం।
అనేక దివ్యాభరణం దివ్యానే కోద్యతా యుధమ్॥
దివ్య మాల్యాంబర ధరం దివ్య గంధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖమ్॥
యథానదీనాం బహవోఽంబువేగాః సముద్రమే వాభిముఖా ద్రవంతి।
తథా తవా మీ నరలోకవీరా విశంతి వక్త్రా ణ్యభి విజ్వలంతి॥

మాధవా! నీ అద్భుతరూప దర్శనంతో నా హృదయం ఆహ్లాదమయంగా వుంది.

మహా ప్రవాహంతో సాగే నదులన్నీ సముద్రాభి ముఖంగా వచ్చేటట్లు, వీరవరేణ్యు లందరూ నీ ప్రజ్వలితాగ్ని సదృశ ముఖంలో పడిపోతున్నారు - అన్నాడు అర్జునుడు.

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో౽లభస్వ జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వ మేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

అందుచేత అర్జునా! లేచి నిలబడి శత్రుసంహారం చేసి, విజయశ్రీ విరాజితుడవై రాజ్యభోగా లనుభవించు. వీరందరినీ నే నిదివరకే సంహరించాను - అని వాసుదేవుడు అనగా

అర్జునుడు, హృషీకేశా! ఇంక ఈ విశ్వరూపాన్ని ఉపసంహరించి, దేవకీ నందన రూపంతో నన్ను అనుగ్రహించు - అని చేతులు జోడించాడు.

వాసుదేవుడు విశ్వరూపాన్ని ఉపసంహరించి, చిరునవ్వుతో అర్జునుని వైపు తిరిగాడు.

మాధవా! నిరంతరం నీ గుణ రూపాలను ఆరాధించే భక్తి శ్రేష్ఠమా? అతీంద్రియమూ అవినాశమూ అయిన బ్రహ్మజ్ఞానం ఉత్తమమా? అని అడుగగా - వాసుదేవుడు.

పార్థా! నిరంతరం నా యందే మనను నిలిపి నా రూపాన్ని ఆరాధించడం ఉత్తమమే. సర్వవ్యాపకమూ, మాయాతీతమూ, నిత్యసత్యమూ, శాశ్వతమూ, నిర్గుణమూ, అయిన పరబ్రహ్మను ఉపాసించేవారు కూడా నన్నే చేరుతున్నారు.

దేహాభిమానికి ఈ ఉపాసన సాధ్యంకాదు. ఏకాగ్రదృష్టితో నన్ను ధ్యానించే వారిని సంసార సాగరం నుండి నేనే తరింపజేస్తాను. జ్ఞానం కంటె ధ్యానం ఉత్తమం. అంత కంటె కర్మ ఫలాపేక్ష లేకపోవడం శ్రేష్ఠం. త్యాగంవల్ల శాంతి ఏర్పడుతుంది.

సుఖ దుఃఖ రాగ ద్వేషాలకు అతీతుడై ఓరిమితో ఆనంద చిత్తంతో నిర్మల హృదయంతో నన్నే స్మరించేవారిని నేను ఉద్ధరిస్తాను. చిత్త వైకల్యం లేకుండా నిష్కామ కర్మ చేసేవాడు నాకు పరమ ప్రియుడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః॥

అన్నాడు.

అప్పుడు అర్జునుడు, మాధవా! ప్రకృతి - పురుషుడూ, క్షేత్రమూ - క్షేత్రజ్ఞుడూ, జ్ఞానమూ, జ్ఞేయమూ అంటూంటారు. ఏమిటిదంతా అనగా

వాసుదేవుడు, పార్థా! ఈ దేహమే క్షేత్రం. దీన్ని తెలుసుకున్నవాడే క్షేత్రజ్ఞుడు. ఇక ఈవిషయమై అనేకులు అనేక భావనలు చేశారు. పంచభూతాలూ, అహంకారమూ, బుద్ధీ, కర్మేంద్రియ పంచకమూ, జ్ఞానేంద్రియ పంచకమూ, మనస్సు, శబ్ద, స్పర్శ, రస, రూప, గంధాలూ, చేతన ధారణాశక్తి ఇవన్నీ క్షేత్రం; గర్వాభిమానాలు లేకుండా క్షమా శీలంతో, అహింసాపరుడై ఆత్మ నిగ్రహంతో, శుచిగా గురుసేవాపరాయణుడై భార్యా, పుత్ర, గృహ రామాదులందు మమకారాలు లేకుండా, ఆత్మజిజ్ఞాసతో నిరంతరం నన్నే స్మరించేవాడు జ్ఞాని. ఇవేవీ లేనివాడు అజ్ఞాని.

యావ త్సంజాయతే కించిత్ సత్త్వం స్థావర జంగమమ్।
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్ తద్విద్ధి భరతర్షభ!॥

స్థావర, జంగమాత్మకమయిన ఈ ప్రపంచం అంతా క్షేత్ర, క్షేత్రజ్ఞ సంయోగఫలమే. ఈ క్షేత్ర, క్షేత్రజ్ఞ భేదాన్ని, మాయనుండి బయటపడే దానిని జ్ఞాననేత్రంతో గ్రహించాలి.

సత్త్వ, రజ, స్తమో, గుణాత్మకమయిన మాయా ప్రకృతిలో క్షేత్ర బీజాన్ని ప్రవేశ పెడతాను అప్పుడీ సృష్టి అంతా సాగుతుంది. అందుచేత సర్వానికీ ప్రకృతి, మాత కాగా నేను తండ్రి నవుతున్నాను. ఈ గుణ త్రయంలో సత్త్వంవున్నదే - అది సుఖాలపై జ్ఞానంపై ఆసక్తిని కలిగించి ఆత్మను బంధిస్తే, రజోగుణం సంసారబంధాన్ని బిగిస్తుంది. తమోగుణం అవివేకాన్ని ఆవరింప జేసి పరాకునూ, సోమరితనాన్నీ, నిద్రనూ ప్రసాదిస్తుంది. ఈ గుణ త్రయాన్ని పారద్రోలినవాడు ప్రకాశ, ప్రవృత్తి, మోహ దూరు డవుతాడు.

సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాద మోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ॥

ధర్మాధర్మరూప కర్మలే వేళ్ళుగా సత్త్వ, రజ, స్తమో గుణాలే కొమ్మలుగా, ఇంద్రియ వాంఛలే చిగురులుగా, వేదాలే ఆకులుగా వున్న సంసారమనే అశ్వత్థ వృక్షాన్ని వైరాగ్య మనే అస్త్రంతో ఛేదించాలి.

ఈ సృష్టి అంతా క్షరమూ, అక్షరమూ అని రెండు విధాలుగా ఉంటుంది. ప్రకృతి వికారంవల్ల పుట్టేదంతా నశించేదే కనక అదిక్షరం. అవినాశన మయిన జీవం అక్షరం. క్షరమయిన సంసారాన్నీ, అక్షరమయిన మాయాజాలాన్నీ అంటీ ముట్టని అతీత పర బ్రహ్మాన్ని నేను.

అభయం సత్త్వ సంశుద్ధిః జ్ఞాన యోగ వ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥

తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత॥

నిర్భయుడై, ఏ కలుష భావమూ లేకుండా ఆత్మ జ్ఞానంతో వుండడం ఇంద్రియ నిగ్రహమూ, దానమూ, వేద కర్మాచరణమూ, వేదాధ్యయనమూ, తపస్సు, బ్రహ్మ యజ్ఞమూ, సత్యవాక్పాలనా, అహింసాదృష్టి, కోపం లేక పోవడమూ, ఔదార్యమూ, దోష దృష్టిరాహిత్యమూ, భూతదయ, లోభ హీనత, సరళ స్వభావమూ; చంచల మనస్కుడు కాకుండడం, ఓరిమీ తేజస్సూ, స్థైర్యమూ, బాహ్యాభ్యంతర శుచీ, పరద్రోహచింతనా రాహిత్యమూ ఇవన్నీ దైవీగుణాలు.

ఇక సత్యాన్నీ సదాచారాన్నీ, శుచిత్వాన్నీ విడిచినవాడూ, ధర్మాధర్మాలను లెక్క చెయ్యనివాడూ, ఈ సృష్టికి స్రష్ట ఎవడూలేడని, స్త్రీ - పురుష సంయోగమే దీనికి కారణమనీ ప్రచారం చేసేవాడూ, అహంకార, దురభిమానాలతో, అవివేకంగా దురాచార, దుస్సంకల్పాలతో సాగేవాడూ, కామ క్రోధాదులకు లొంగినవాడూ అక్రమ ధనార్జన పరుడూ వీరందరూ ఆసురీస్వభావులు. వీరు పదే పదే అవే గుణాలతో అనేక జన్మలు ఎత్తుతూంటారు. సాత్త్వికులు దైవీశక్తులను ఆరాధిస్తారు. రాజ స్వభావులు యక్ష, రాక్షసారాధన చేస్తే, తామసులు భూత ప్రేత సేవచేస్తారు. యాగమూ, దానమూ, తపస్సు, చిత్తశుద్ధి కోసం సాగించాలి. వాటిని నిష్కామంగా సాగించాలి.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

సర్వకర్మలనూ, కర్మఫలాన్నీ నాకే అర్పించి నన్నే శరణుపొందు నిన్ను సర్వపాప విముక్తుణ్ణి చేసి మోక్షం ఇస్తాను. విచారించకు అని బోధించాడు.

అర్జునుడు ఈ ఉపదేశంతో స్వస్థ చిత్తుడై గాండీవం ధరించి నిలబడ్డాడు.

ఇది గీతాసారము

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీః విజయో భూతిః ధ్రువానీతి ర్మతి ర్మమ॥

— సంజయుడు

## యుద్ధప్రారంభం

మహారాజా! పాండవసేనాముఖంలో గాండీవం ధరించి నిలిచిన అర్జునుని చూడగానే అతని వెనుక నిలిచిన యోధులందరూ సింహనాదాలు చేశారు. మహావీరుల శంఖ ధ్వానాలు, శంఖ, భేరీ, క్రకచ, గోముఖ, నారసింహాది యుద్ధవాద్యాలు మిన్నుముట్టాయి ఆ సంగ్రామాన్ని చూడడానికి దేవ, గంధర్వ, సిద్ధ, చారణ గణాలు ఆకాశంలో నిలిచాయి.

ఆ సమయంలో ధర్మరాజు తన కవచం విప్పి, ఆయుధాలను రథం మీద వుంచి, క్రిందికి దిగి శత్రు సేనాముఖంగా అడుగులు వెయ్యడం చూసి, మిగిలిన సోదరులూ, కృష్ణుడూ ఆయనను అనుసరించారు.

అప్పుడు భీముడూ, సహదేవుడూ - అగ్రజా! ఏమిటిది! ఇప్పుడీ నడక ఎక్కడికి? అని అడిగారు.

ధర్మరాజు వారివైపయినా చూడకుండా ముందుకు సాగుతూంటే, కృష్ణుడు చిరునవ్వుతో - అర్జునా! భీష్మ, ద్రోణ, కృప, శల్యులు మీకు పూజ్య గురు స్థానీయులు. అటువంటి వారి ఆదేశం పొందకుండా యుద్ధానికి దిగడం శాస్త్ర సమ్మతం కాదు; కనుక ధర్మజుడు ఆ ఆచారాన్ని పాటిస్తున్నాడు - అని చెప్పాడు.

ఆ విషయం తెలియకుండా - ఉభయ పక్షాలలోని క్షత్రియ వీరులు కొందరు, యుద్ధానికి భయపడి, క్షత్రియ వంశానికి కళంకం తెచ్చేపని ధర్మరాజు చేస్తున్నాడని హేళన ప్రారంభించారు; మనవారి ఉత్సాహానికి పట్టపగ్గా ల్లేవు.

అలా వచ్చి పాదాలకు నమస్కరించే ధర్మరాజును దగ్గరగా తీసుకొని భీష్ములవారు:

నాయనా! నాకు చాలా సంతోషంగా వుంది. నేను యుద్ధానికి అనుమతి యిస్తున్నాను. నీకు పరాజయం లేదు.

అర్థస్య పురుషో దాసః దాస స్త్వర్థో న కస్యచిత్ -

ఎక్కడయినా మనిషి లక్ష్మికి దాసుడవుతున్నాడే కాని, లక్ష్మి ఎవరికీ దాసీత్వం చెయ్యలేదు. నేటివరకూ నేను వీరి పోషణలో వున్నాను కనుక ఈ పక్షంలో పోరాడుతున్నాను - అన్నాడు.

ఆయన ఆశీస్సులతో ధర్మరాజు ముందుకు సాగి ద్రోణాచార్యులకూ, కృపాచార్యులకూ, శల్యునికీ నమస్కరించి వారి ఆశీర్వాదాలు పొంది తిరిగి వచ్చాడు.

ఈ మధ్యలో కృష్ణుడు, యుద్ధం చూడ వచ్చిన ప్రేక్షకులలో వున్న కర్ణుని సమీపి
రాధేయా! భీష్ములవారు నేలకూలే వరకూ నువ్వు మా పక్షంలో వుండి పోరాడవచ్చు గ
అనగా కర్ణుడు :

ఎందుకయ్యా ఈ కికురింపు! సుయోధనునికి అప్రియమయిన పని ఒక్కటీ
చెయ్యను - అన్నాడు.

తిరిగివస్తూ ధర్మరాజు ఉభయపక్షాలను చూసి :

యుద్ధం ప్రారంభం కానున్న ఈ సమయంలో ఎవరయినా అటువారు యిటు క
యిటువారు అటుకాని వెళ్ళదలచుకుంటే ఎవరికీ అభ్యంతరం లేదన్నాడు.

అప్పుడు యుయుత్సుడు మన పక్షంనుండి వారివయిపు వెళ్ళిపోయాడు. వ
వానికి స్వాగతమిచ్చారు.

ధర్మరాజు తన రథం ఎక్కాడు. అంతలో మరొక్కమారు రణధ్వానాలు రేగా
ప్రచండవాయువులో వృక్షాలవలె ఊగిసలాడుతూ సేనలు సాగుతున్నాయి. ప్రళయకాలం
సముద్రం ఘోషిస్తున్నట్లు వారి కోలాహలం వినవస్తున్నది.

మత్తేభ ఘీంకారాలు, జాత్యశ్వాల హేషారవాలు, పదాతుల పాద ఘట్టనాలు, మ
యోధుల శంఖ ధ్వానాలూ, ఏనుగుల, గుర్రాల మెడలలోని ఘంటా ధ్వానాలూ కురుక్షేత్రా
చుట్టుముట్టాయి.

కాలదండం వంటి ధనుస్సును చేబట్టి నిలిచిన భీష్మాచార్యుల రథం ఎదురువస్తూ
గాండీవం సంధించి అర్జునుడు తన రథాన్ని ఆయనకు ఎదురు నడిపించాడు.

కృతవర్మకు ఎదురుగా సాత్యకి, బృహద్బలుని ముందు అభిమన్యుడు, మన య
రాజుకి అభిముఖంగా భీమసేనుడు, దుశ్శాసనుని సమక్షంలో నకులుడూ. దుర్ముఖుని
పోరాటానికి సహదేవుడూ, శల్యుని ఎదుట ధర్మరాజూ, ఆచార్య ద్రోణులకు ఎదుర
ధృష్టద్యుమ్నుడూ, బాహ్లీకునితో యుద్ధానికి ధృష్టకేతువూ, అలంబుసునిమీదికి ఘటోత్కచుడ
అశ్వత్థామ కెదురుగా శిఖండి, సైంధవుని ముందు ద్రుపదుడూ, శకుని మీదకు ద్రౌ
నందనుడు ప్రతివింధ్యుడూ యిలా సంగ్రామరంగస్థలంలో రణక్రీడ ఆరంభమయిం
భయానకంగా వున్నా రమణీయంగా వుంది.

పదాతులు పదాతులనూ, గజబలం గజబలాన్నీ, తురగదళం తురగదళాన్నీ, ర
కులు రథికులనూ ఎదుర్కొనడం చూస్తే ఒకే రథికుడూ, ఒకే పదాతీ, ఒకే తురగారూఢుడ
పోరుతున్న భ్రమ కలిగింది.

క్రమంగా సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. అప్పటికి యుద్ధతీవ్రత హెచ్చింది. వంగిన మొనలతో వున్న బాణాలను విడుస్తూ, భీష్మాచార్యుడు శత్రు సేనా సమూహాన్ని చిందర వందర చేస్తున్నాడు. ఆయన వాడి బాణాల దెబ్బతిన్న మత్తేభాలు ఆ తాకిడికి ఆగ లేక విపరీతంగా రోదిస్తున్నాయి. అప్పటి కాయన ఎదురుగా కాశీ, చేది, కరూష, పాంచాల దేశయోధు లున్నారు. ఆయన రణ నృత్యం చేస్తున్నాడు. అది చూసి అభిమన్యుడు ఆయనకు ఎదురు వచ్చాడు.

ఆ సమయానికి కృతవర్మ, కృపాచార్యుడూ, శల్యుడూ, వివింశతి, దుర్ముఖుడూ అక్కడకు వచ్చారు. అభిమన్యుడు ఒకబాణంతో కృతవర్మనూ, అయిదుబాణాలతో శల్యునీ, బాణపరంపరతో భీష్మనీ, చికాకుపరుస్తూనే కృపాచార్యుని ధనుస్సును రెండుముక్కలు చేశాడు. ఆ వీరవరుడు చక్రంలా తిరుగుతూ, చేతిలోని ధనుస్సును చక్రాకృతిలో నడుపుతున్నాడు. చూస్తూండగానే భీష్ముని రథచక్రరక్షకులు నేలకూలారు. భీష్ముని బాణాలు అభిమన్యుని సారథిని నేలకూల్చాయి. అంతలో ఆయన రథధ్వజం నేలకూలడం చూసిన మనసేనలు కోలాహలం ప్రారంభించాయి.

అభిమన్యుని విజృంభణ చూసి భీమసేనుడు సింహగర్జన చేశాడు. అదివిని సాత్యకి భీమసేనునితో అభిమన్యునికి రక్షగా వచ్చాడు. విరాట, ధృష్టద్యుమ్నులు కూడా అక్కడకు చేరారు. పితామహుడు సాత్యకినీ, ధృష్టద్యుమ్ననీ వేధించి భీముని రథధ్వజాన్ని ఖండిం చాడు. భీమునికి క్రోధం హెచ్చి, కృపాచార్యునీ, కృతవర్మనూ, భీష్మనీ శర వర్షంతో ముంచాడు.

తొండాన్ని ముడిచి నోట్లోవుంచుకొని తీవ్రవేగంతో వచ్చే మత్తేభం మీద ఉన్న ఉత్తరుడు శల్యుని ఎదుర్కొన్నాడు. శల్యుని బాణాలు తగిలి మరీ రెచ్చిపోయిన ఆ మదపు టేనుగు శల్యుని రథాశ్వాలను తుత్తునియలు చేసింది. అప్పుడు శల్యుడు వదిలిన లోహ నిర్మితమయిన శక్తి ఉత్తరుని కవచాన్ని ఛేదించింది. ఉత్తరుడు స్పృహ కోల్పోయాడు.

అదే అదనని శల్యుడు దాని తొండాన్ని ఖండించడంతో అది విలవిల తన్నుకు నేలకూలింది. ఆ సమయంలోనే శల్యుడు తనకు సమీపంలో వున్న కృతవర్మ రథంమీదికి నడిచాడు. ఉత్తరుని సోదరు డిదంతా చూసి ఆకర్ణాంతం లాగిన బాణం విడిచాడు. అప్ప టికే బృహద్బల, జయత్సేన, రుక్మరథ, విందానువింద, సుదక్షిణ, సైంధవులు శల్యుని రక్షణకు చేరారు. వారి ధనుస్సులు మెరుపుతీగల్లా మెరుస్తున్నాయి.

వర్షాకాల ప్రారంభసమయంలో పడే వానలా వారు విడిచే బాణాలు తనమీదకు రాకుండానే వారి ధనుస్సులను తుత్తునియలు చేశాడు శ్వేతుడు ఆ యోధుడు భల్లం విసర

దంతో మన రుక్మరథుడు మూర్ఛపోయాడు. అయితే సారథి అప్రమత్తంగా వుండడంవ రథాన్ని మరలించేశాడు. అప్పటికి భీష్మాచార్యులు, దుర్యోధనునితో శల్యుని రక్షణ వచ్చాడు. ఈశ్వేతుని వెంట శిఖండి రక్షకుడుగా వచ్చాడు.

భీష్మాచార్యులు విడిచే బాణాలు సోకి శత్రుసైనికుల శీర్షాలు నేలరాలి పొర్లుతున్నాయి కవచాలంకృతమయిన గజదళం వజ్రపు దెబ్బతిన్న కొండల్లా పడుతున్నది. గుర్రాలు వె దిరిగి రథాలను ఈడ్చుకు పోతున్నాయి. తుములయుద్ధం ఆరంభమయింది. రణరంగం ధూ ధూసరితం అయి ఒకరికొకరు కనిపించడం లేదు. ధనుష్టంకారాలూ, సింహ నాదాలూమాత్ర వినవస్తున్నాయి. ఆ సమయంలో ప్రతిపక్షంలో శ్వేతుడు సాగించే వీర విహారాన్ని నిలిపి నిలి నది పితామహులొక్కరే. ఆయన మత్త గజేంద్రంలా విహరిస్తుంటే పాండవ సేన పలాయన సాగిస్తున్నది. అయితే శ్వేతుడు ఆయన కెదురు నిలిచి ఆ ప్రమాదాన్ని నివారించాడు.

అలా కొంతసేపు యుద్ధం సాగించి, భీష్ముడు వెనుదిరగడంతో మనవారు హాహా రవాలు ఆరంభించారు. వారు హర్షధ్వానాలు చేశారు. ఇవేమీ లక్ష్యపెట్టకుండా ఆయ కొంత విశ్రాంతి తీసుకుని యుద్ధభూమికి తిరిగివస్తూనే శ్వేతునికి ఎదురు వెళ్ళాడు. అప్పుడ సాగిన యుద్ధంలో ఏ క్షణానికి ఆ క్షణం పితామహుడు నేలకూలుతాడనే భయమే. ఆయ చేతిలోని రెండు మూడు ధనుస్సులను శ్వేతుడు ఖండించాడు. అప్పుడు నిశితభల్లాలత వాని సారథినీ, గుర్రాలనూ నేలకూల్చాడు, పితామహుడు.

మహోగ్రమయిన శక్తిని సంధించి విడిచాడు - శ్వేతుడు. అది కుబుసం విడిచి కోడెత్రాచులా వస్తుంటే మనవారందరూ హాహారవాలు చేశారు. కానీ అచంచలంగా నిలి గాంగేయుడు తొమ్మిది బాణాలతో దానిని తుత్తునియలు చేశాడు. గదాధరుడయిన శ్వేతుడ భీష్ముని మీదికి లంఘించే సమయంలో యీయన రథం దిగేశాడు. వాడు విసిరిన గదాదండ మన సేనానాయకుని రథాన్ని అశ్వాలతో, సారథితో చూర్ణం చేసింది.

గాంగేయుని క్రోధం పెరిగింది. ఆయన తీవ్రశరం సంధించి, అభిమంత్రించి విడ చాడు. సాయంవేళ పశ్చిమసముద్రంలో సూర్యుడు మునిగిపోయేటట్లు శ్వేతుడు తేజోహీనుడై భూమిమీద పడ్డాడు. మనవారు భేరీధ్వనులతో నాట్యం చేశారు. వారి బలంలోని మహ రథికులు కూడా కంపించి పోయారు. కృష్ణుడు రథాన్ని వెనుకకు త్రిప్పాడు. కొంతసేప అటూ, యిటూ గర్జనలే తప్ప యుద్ధం లేదు.

అంతలోనే ఉభయ సేనలూ యుద్ధోన్ముఖులయ్యాయి. మద్రరాజయిన శల్యునితో శంఖుడు తలపడ్డాడు. శల్యుడు గదాదండం విడిచి వాని గుర్రాలను నేలకూల్చాడు. పా

లేని నిప్పులా వెలుగుతున్నా డాయన. శంఖుడు అర్జునుని రథంమీద చేరడంతో భీష్మా చార్యులు ద్రుపదుని మీదికి నడిచాడు. పాండవసేన యిటు కన్నెత్తి చూడలేక పోతున్నది.

చలిగాలిలో గోవులవలె, సింహ విహారవేళ లేళ్ళవలె పాండవులు భయభ్రాంతు లవుతున్నారు. భీష్ముడు విడిచే బాణాలు ఒక రాచబాటలా కనిపిస్తున్నాయి. ఆయన బాణం సంధించి ఒక్కొక్క యోధుని పేరుపెట్టి పిలిచి, విడుస్తూంటే వాడు నేల కూలుతున్నాడు.

ఆయన వీరసంహారక్రీడ సాగిస్తుండగా సూర్యుడు పడమటి కొండకు చేరాడు. చీకటి రేకలు విజృంభించే వేళ యుద్ధం ఆపి ఎవరి శిబిరాలకు వారు చేరారు. ఇది మొదటిరోజు యుద్ధక్రమం.

మొదటిరోజు యుద్ధం మనవారికి చాలా ఆనందాన్ని కలిగించింది. వారికి అవమాన కరమూ, విషాద జనకమూ అయింది. ఆ రాత్రి ప్రొద్దు పోయాక ధర్మరాజు తన మహారథి కుల సమావేశంలో —

భీష్మపితామహుని వీరవిహారానికి ఎదురు నిలిచేవారు కనిపించడం లేదు. ఈమహా రాజుల్నీ, వీరసింహాలనూ ఆయన కత్తికి ఎరగా విడవడంకంటె, యుద్ధం విరమించి శాంతంగా అడవులకు వెళ్ళడం మంచిదనిపిస్తుంది. ఒక్కభీముడు తప్ప మనవారెవరూ సాహసించడమే లేదు. అర్జునుడు కూడా ఉపేక్షిస్తున్నట్లే వుంది, అని శోక సంతప్త చిత్తుడు కాగా -
వాసుదేవుడు :

ధర్మనందనా! నీ కీ భావం కలగ వలసింది కాదు, నీ సోదరులతోపాటు ఈ మహా రాజులందరూ నీసేవకోసం సన్నద్ధులయి వున్నారు. శిఖండి చాలు భీష్ముని నిలబెట్టి కడతేర్చ డానికి. ఇక సర్వసేనాని ధృష్టద్యుమ్నుడు కూడా శాత్రవసంహార దీక్షాకంకణం ధరించి వున్నాడు. నువ్వు నిర్భయంగా వుండు - అని ఆశ్వాసన యిచ్చాడు.

అప్పుడు ధర్మరాజు : సేనాపతీ! దేవాసుర సంగ్రామవేళ బృహస్పతి క్రౌంచ వ్యూహంతో దేవేంద్రుని నడిపించి విజయం సాధించాడు. ఇప్పుడు ఉభయ పక్షాలకు ఆశ్చర్యం కలిగేటట్లు నువ్వు ఆ వ్యూహం నిర్మించి మన సేనను నడుపు అన్నాడు.

## రెండవరోజు

తెల తెల వారుతుండగా పాండవ సేనాగ్ర భాగంలో అర్జునుని రథం, ఆ రథం మీద కపిధ్వజం వారి వారందరికీ ఉత్సాహాన్ని కలిగిస్తూ సాగుతున్నది.

ధృష్టద్యుమ్నుడు క్రౌంచవ్యూహం పన్నాడు. దానికి శిరస్థానంలో ద్రుపదుడు సేన సమేతంగా వున్నాడు. కుంతిభోజ ధృష్టకేతువులు నేత్ర స్థానాలుగా వున్నారు. కంఠదేశంలో దశార్ణ, అనూప, కిరాత గణాలు నిలిచాయి. పౌండ్ర, పౌరవ, నిషాద, పాటచ్చర సేనలతో ధర్మరాజు పుచ్ఛభాగంలో వున్నాడు. భీమసేను డొకవంక, ధృష్టద్యుమ్ను డొకవంక రెక్కలుగా వున్నారు. వారి ననుసరించి పదివేలమంది యోధులు వస్తున్నారు. అభిమన్యుడు దరద, మారుత, ధేనుక, పాండ్య, చోళ, తంగణ దళాలతో దక్షిణ భాగాన మాళవ, శబర వత్స దేశాల వారితో నకుల, సహదేవులు వామ పక్షాన వస్తున్నారు. కేకయ రాకుమారు సహితులై విరాటుడు జఘన భాగంలో రాగా ముప్పదివేల రథబలంతో కాశీ, శైబ్య నరేశుల వానికి రక్షగా వస్తున్నారు. వ్యూహమంతకూ అర్జునుడు రక్షకుడుగా వున్నాడు.

ఆ వ్యూహాన్ని చూసి మీ కుమారుడు తన యోధులతో భీష్మపితామహుని నాయకత్వంలో మనం ముందుకు సాగి, భీమసేనుని అండతో వచ్చేవారిని నిస్సంకోచంగా ఓడించగలం. అయితే వారు పన్నిన వ్యూహవిచ్ఛేదానికి యోగ్యమయిన వ్యూహాన్ని నిర్మించాలి- అనగా వారంతరూ భీష్ములవారి వెంట నడిచారు. ఆయనను అనుసరించి ద్రోణాచార్యులూ ఆయన వెంట నానా దేశాల చక్రవర్తులూ మహోత్సాహంతో సాగుతున్నారు.

ఉభయ సేనలూ శంఖ ధ్వానాలతో ధనుష్టంకారం చేశాయి. బంగారు రెక్కలు కట్టిన బాణాలు అటూ, ఇటూ పక్షులగుంపులా విహరిస్తున్నాయి.

ధనుస్సును సంధించి విరాట, భీమసేన, సాత్యకి, ధృష్టద్యుమ్న, భీమసేనులతో అభిమన్యుని కూడా బాణవర్షంలో ముంచుతున్నాడు భీష్ముడు. అది చూసి అర్జునుడు:

కృష్ణా! ఈ యుద్ధంలో యీ వృద్ధయోధుడు మన సేనావాహినిని అపోశనం పట్టేటట్టు కనిపిస్తున్నది. ముందుగా మన రథాన్ని ఆయన వైపు నడుపు, అన్నాడు.

భీష్మ, ద్రోణ, కృప, శల్య, జయద్రథ, శకుని, వికర్ణులు అర్జునునితో తల పడ్డారు. అది చూసి విరాట సాత్యకి, ధృష్టద్యుమ్నులూ, అభిమన్యుడూ, ద్రౌపదీనందనులూ వారి కెదురు వచ్చారు.

పితామహుడు విడిచే బాణాలను అర్జునుడు ఛిన్నాభిన్నం చేస్తుంటే, ఆ యోధుని బాణవర్షాన్ని ఈయన చెల్లాచెదురు చేస్తున్నాడు.

యుద్ధం తీవ్రమయేసరికి భీష్ము డెటు వున్నాడో తెలియడం లేదు. తాళధ్వజాన్నీ ఈయన కపిధ్వజాన్నీ చూసి ఎవరు ఎవరో తెలుసుకోవలసి వస్తున్నది. రణక్షేత్రంలో పితా

మహాను బాణాలను విత్తనాలుగా చల్లుతుంటే, విత్తనంగింజ నిలవనంత తీవ్రంగా అర్జునుడు శరవర్షం కురుస్తున్నాడు. వీరికి కొంచెం దూరంలో ద్రోణాచార్యులూ, ధృష్టద్యుమ్నుడూ ఒకరితో ఒకరు పోరుతున్నారు. ఆచార్యుని వాడిబాణాలు వారి రథసారథిని నేలకూల్చడంతో అతడు మరింత కుపితుడై 'ఆచార్యా, నిలు' అంటూ శరపరంపర గుప్పించాడు.

ఆచార్యులకు క్రోధం పెరిగింది. అది చూసి ధృష్టద్యుమ్నుడు మరింత మీదికి రాగా, ఆచార్యుడు నిశితశరం సంధించే సరికి హాహారవాలు చెలరేగాయి. దాన్ని దారిలోనే ఖండించాడు ధృష్టద్యుమ్నుడు. లోహనిర్మిత గదాదండం విసిరాడు పాంచాలయోధుడు. అది దారిలోనే తుత్తునియలు అయింవి. ఆచార్యుని బాణాలకు చిక్కి, వా రుభయులూ నిండుగా పూసిన అశోకవృక్షాల్లా వున్నారు, శరీరాలు గాయాలతో నిండి.

అప్పటికి భీమసేనుడు అక్కడకు చేరాడు. ఆచార్యునికి రక్షగా కళింగసేనలువచ్చి భీముని ఎదుర్కొన్నాయి.

యుద్ధభూమి అంతా రక్తంతో తడిసిపోయింది. మన కళింగ సేనలతో నిలవలేక వారి చేదిసైన్యం పలాయనం పఠించింది. అంతలో భీముని గుర్రాలు నేలకూలాయి. భీమసేనుడు గద విసిరాడు. రథ ధ్వజంతో సారథితో, కళింగ రాకుమారుడు పడిపోయాడు.

భీమసేనుడు ఉన్మత్తగజంలా విహరిస్తూ భ్రాంత, ఉద్భ్రాంత, ఆవిద్ధ, ఆప్లుత, ప్రస్రుత, ప్లుత, సంపాత, సముదీర్ణవిధాల హస్తలాఘవం ప్రదర్శిస్తూ మనవారిని పిప్పి పిప్పి చేస్తున్నాడు. ఆ సమయంలో రెండువేల మంది కళింగయోధులు నేలకూలారు. భీమసేనుడు గదాదండంతో విహరిస్తుంటే మన గజబలం ప్రచండవాయువుతో చెల్లాచెదరయే మేఘాలవలె వుంది. అవి పిచ్చెత్తినట్టు పలాయనం సాగిస్తుంటే వాటి కాళ్ళ క్రింద పడి మన సైనికులు విలవిల తన్నుకుంటున్నారు. శిఖండి ప్రభృతి మహారథికులు భీమునికి తోడు వచ్చారు. సాత్యకి కూడా అక్కడకు చేరాడు.

కళింగసైనికుల రక్తం ఒక నదిలా ప్రవహిస్తున్నది. భీముడు తమపాలిట యమధర్మరాజులా కనిపించడంతో వారందరూ గగ్గోలు పడ్డారు. అది చూసి భీష్మాచార్యులు అటు రథం నడిపి భీముని రథానికి పూన్చిన గుర్రాలను నేలకూల్చాడు. భీముడు గదాదండంతో రథంమీది నుండి క్రిందికి దూకేశాడు. ఆ సమయంలో సాత్యకి విడిచిన బాణాలు భీష్ముని రథసారథిని బలిగొన్నాయి. అంతతో గుర్రాలు రథాన్ని రణరంగంనుండి వెనుకకు లాక్కుపోయాయి.

కళింగరాజయిన భానుమంతుడూ, రాకుమారుడు కేతుమంతుడూ, వీరవరు వజ్రదేవుడూ అసంఖ్యాక సేనతో ఆ యుద్ధంలో మరణించారు.

ధృష్టద్యుమ్నుడు అసహాయశూరుడై కృప, శల్య, అశ్వత్థామలతో యుద్ధం ఆ భించాడు. అతడు విడిచిన బాణాలు ద్రోణపుత్రుని అశ్వాలను నేలకూల్చాయి. అశ్వత్థా శల్యుని రథంమీదికి నడిచి ధృష్టద్యుమ్నునిపై బాణవర్షం కురిపించాడు. అప్పటికి అ మన్యుడు అక్కడకు చేరాడు. అది చూసి దుర్యోధనుని కొడుకు లక్ష్మణకుమారు అభిమన్యునికి ఎదురు వచ్చాడు. వారి మధ్య జరిగిన యుద్ధంలో ముందుగా అభిమన్యు ధనుస్సును నీ మనుమడు ఖండించాడు.

అంతతో అభిమన్యుడు మరో ధనుస్సును గ్రహించి విజృంభించాడు. లక్ష్మ కుమారుడు ఊపిరి సలుపుకోలేక పోతున్నాడు. అంతలో దుర్యోధనుడు మరి కొంద రాజులతో వానికి సాయంగా వచ్చాడు. ఇందరూ అభిమన్యుని చుట్టుముట్టడంతో అర్జు డటు వచ్చాడు.

అప్పుడు అర్జునుడు విడిచిన బాణాలతో ఆకాశం మూసుకు పోయింది. సూర్య ణాలు భూమి మీద పడడం లేదు. భీష్మ ద్రోణాది ప్రముఖు లందరూ వాని కెదురు చారు. అర్జునుడు ప్రళయ భీకర రూపంతో విజృంభిస్తుంటే కౌరవ సేన వికావిక లవుతున్న అప్పటికి సూర్యుడు అస్తగిరి చేరుతున్నాడు. అది చూసి ద్రోణాచార్యులు భీష్మునితో ఆరా మన వారిని ఏ దశకు తేవాలో ఆ దశకు తెచ్చాడు అర్జునుడు. ఇప్పుడింక రణరంగం నిలవలేము. సూర్యాస్తమయం కూడా అవుతున్నది. మనవారూ అలసి వున్నారు. యుద్ధ ఈ రోజుకు ఆపుదాం అనగా భీష్ముడు యుద్ధ విరామం ప్రకటించాడు.

సోమక, పాంచాలసేనలు అర్జునుని అభినందిస్తూ, విజయశంఖ ధ్వానాలతో రాల వయిపు సాగాయి.

## మూడవరోజు

సంజయా! మూడవరోజు యుద్ధవిశేషాలేమిటి? అని ధృతరాష్ట్రుడు అడుగగా :

మహారాజా! తెల తెలవారుతుండగా భీష్ముడు తన సేనను గరుడవ్యూహంలో మోహ రించాడు. ద్రోణాచార్యులు, కృతవర్మ నేత్రస్థానాలలో, కృపాచార్యుడూ, అశ్వత్థామ శీ భాగంలో, భూరిశ్రవస, శల, శల్య, భగదత్త, జయద్రథులు కంఠసీమలో, సోద సహితుడై దుర్యోధనుడు పృష్ఠభాగంలో, విందానువిందులూ, కాంభోజ, శూరసేన

శకదేశయోధులూ పుచ్ఛభాగంలో, మగధ, కళింగయోధులు దక్షిణపక్షంలో, కరూష, నికుంభాది దేశాల యోధులు వామపక్షంలో నిలువగా నాసికాభాగాన భీష్ముడే నిలవడం చూసి, అర్జునుడు తమ సేనానిచే అర్ధచంద్రవ్యూహం పన్నించాడు.

దక్షిణశిఖరంలో భీమసేనుడు మహారథికులతో నిలిచాడు. వామపక్షాన అర్జునుడే నిలబడ్డాడు. ప్రళయవేళ యమునివలె పార్థుడు మనసేనను సంహరిస్తున్నాడు.

రథికుడు రథంమీది నుండి ఎదురుగావున్న ఏనుగుమీదికి లంఘించి, మావటివాని శిరస్సునుపట్టి, పడగొట్టి తల నరుకుతున్నాడు. ఒక్కొచోట పదాతులే గజబలాన్ని సంహరిస్తున్నారు. కొద్దిఘడియల సమయంలోనే రణరంగం రక్తంతో తడిసిపోయింది.

భీష్మ, ద్రోణ, శల్య, శకుని, సైంధవ ప్రముఖులు పాండవవ్యూహాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్నారు. అటునుంచి భీమసేనుడూ, చేకితానుడూ, సాత్యకి, ఘటోత్కచుడూ, ద్రౌపదీనందనులూ మన మీదికి ఎదురొస్తున్నారు ఆ యుద్ధం దేవ - దానవ సంగ్రామాన్ని తలపిస్తున్నది.

ఘటోత్కచునితో సుయోధనుడే తలపడ్డాడు. సాత్యకీ, అభిమన్యుడూ శకునిమీద సాగిస్తున్నారు.

అర్జునుడు మనవంక నున్న చక్రవర్తులమీద తలపడ్డాడు.

అప్పుడు ఘటోత్కచుని ధాటికి నిలవలేక దుర్యోధనుడు రథంమీద కూలబడ్డాడు. అది చూసి సారథి రథాన్ని మరలించేశాడు. అంతతో ఆ వెనుక సేనలు పలాయనం చేశాయి. అది చూసిన భీష్మ ద్రోణులకు తీవ్రక్రోధం కలిగింది. వారు మన సేనలకు ఉత్సాహం కలిగిస్తూ ముందుకు నడుపుతూండగా సుయోధనుడు మూర్ఛ తేరుకున్నాడు. ఆచార్య పితామహులను సమీపించి - మీ రుభయులూ వుండగా మన సేనలు చెల్లాచెదురు కాకూడదు. మీ ఉపేక్షకు కారణం తెలీడం లేదు - అనడంతో భీష్ముడు:

నాయనా! పాండవులపై విజయం దేవతలకే అసాధ్యం. అయినా నా పరాక్రమం ప్రదర్శిస్తాను చూడు - అంటూ విజృంభించాడు. ఆయనవెంట నీ కుమారులందరూ రక్షగా సాగుతున్నారు.

అప్పు డాయన నడిపిన యుద్ధంలో ఏనుగులు రాళ్ళగుట్టల్లా పడుతున్నాయి. తలలు తెగిన సైనికులు విలవిల తన్నుకుంటూ మరణిస్తున్నారు రక్తప్రవాహంతో, మాంసపంకంతో నిండింది రణరంగం. చెల్లాచెదురుగా పడ్డ కవచ, శిరస్త్రాణకాంతులతో నక్షత్రశోభితమయిన

శారదాకాశంలా వుంది, రణభూమి. వారిసేన భయభ్రాంతమై కవచాలు తీసేసి జుట్టు
బోసుకొని రోదిస్తూండగా చూశాడు అర్జునుడు.

అప్పుడు కృష్ణుడు : అర్జునా! ఘోర భీకర వదనగహ్వరం తెరుచుకు వచ్చే మ
దేవతలా వున్న భీష్మని చూస్తున్నావు కదా! ఇప్పుడు నువ్వే మనవారికి రక్ష - అ
రథాన్ని ఆయనవైపు నడిపించాడు. అప్పటికి వారి సేనలకు ధైర్యం చిక్కింది.

పితామహుడు కురిపించే బాణవర్షంలో అర్జునుని రథం కనిపించడం లేదు. అ
అర్జునుడు విడిచిన బాణం భీష్మని ధనుస్సును రెండుముక్కలు చేసింది. ఆయన వ
ధనుస్సును గ్రహించాడు. అదీ విరిగింది. పితామహుడికి అర్జునుని హస్తకౌశలం ఆనంద
కలిగించింది. మరొక ధనుస్సును చేబూని సారథ్యం సాగిస్తున్న కృష్ణుని వేధించాడా

ద్రోణ, కృతవర్మలూ, జయద్రథుడూ, కృపాచార్యుడూ, మరికొందరూ అర్జు
మీదికి రావడం చూసి సాత్యకి వారి కెదురు నిలిచాడు.

## చక్రధారి

ఓ మహావీరులారా! మీరంతా క్షాత్రవిరుద్ధంగా పోరాటానికి సాహసిస్తున్నారు.
అధర్మాన్ని ఆపండి, అని సాత్యకి అంటూండగా అటు భీష్ముడు మహోద్ధృతంగా
సంహారం సాగించడం చూసి, కృష్ణుడు :

సాత్యకీ! వీరెవరికీ మన మాటలు రుచించవు. ఇదిగో నేను రణరంగంలో
శిస్తున్నాను, అంటూ చక్రధారియై రథం దిగేశాడు. గాలితరంగాలలో తేలియాడే పీ
బరంతో ఆయన విద్యున్మాలామధ్యంలో మేఘంలా ఉన్నాడు. ఆయన చేతిలోని సుదర
సహస్ర దళ పద్మంలా వున్నది. ఆయన నాభిదేశం ప్రాతర్వేళ ప్రకాశించే సూర్యబింబ
వున్నది. కుప్పించి ఎగసిన కుండలంబులకాంతి గగనభాగమ్మెల్ల గప్పికొనగ ఆమహావీ
వస్తూంటే మన పితామహుడు చిరునవ్వుతో, ధనుస్సుకు బాణం సంధించి, ఆకర్ణాంతం

ఏహ్యేహి దేవేశ! జగన్నివాస!
నమోస్తుతే శార్ఙ్గ గదాసిపాణీ!।

దేవదేవా! ఈ రణరంగంలో నీ చక్రధారలలో దేహయాత్ర చాలించడం క
అదృష్టం లేదు .... .... రా .... రా — అంటున్నాడు.

అర్జునుడు పరుగు, పరుగున కృష్ణుని చేరి, పాదాలు పట్టి మాధవా! ఏమిటిది! నీ పాదాలుపట్టి చెపుతున్నాను. నేను నా సర్వశక్తులూ వినియోగించి యుద్ధం చేస్తాను. ఈ యోధులందరినీ సంహరిస్తాను, అనడంతో -

వాసుదేవుడు వెనుదిరిగి, రథమెక్కి కళ్ళాలు చేబూని, ఒక్కసారి పాంచజన్యం పూరించడంలో వారి సేనలకు మహోత్సాహం కలిగింది.

పోరు ఘోరమయింది. అటూ, ఇటూ యోధులందరూ విజృంభించారు ఆ సమయంలో రణరంగం వైతరణీనదిలా వుంది. అప్పుడు అర్జునుడు విడిచిన ఐంద్రాస్త్రం మన సేనను చీకాకు చేస్తున్నది. సూర్యుడు అస్తగిరి చేరాడు. సేనలు శిబిరాలకు చేరాయి.

ఇది మూడవనాటి యుద్ధం.

మహారాజా!

తెల తెల వారుతూండగా పితామహుడు మన సేనలను వ్యాళవ్యూహంలో నిలిపాడు. ఆ వ్యూహంలో మనసేన బహు నిగూఢంగా వుంటుంది. సైన్యం ఎంత వున్నదో, అందులో ప్రముఖు లెవరున్నారో, ఎక్కడున్నారో తెలీదు. అటువంటి ఎత్తుగడతో మనవారు నిలవడం చూశారు అర్జునుడు.

రథాన్ని ముందుకు నడిపాడు వాసుదేవుడు. వారి ననుసరించి నాలుగువేల ఏనుగులు వస్తున్నాయి. చేది, పాంచాలవీరులు మహోత్సాహంలో వున్నారు.

అర్జునుని కెదురునడిచే భీష్ముని వెంట కృప, ద్రోణ, శల్య, వివింశతి, దుర్యోధన, భూరిశ్రవసు లున్నారు. అర్జునునికంటె ముందుగా అభిమన్యుడు భీష్ముని ఎదుర్కొన్నాడు. అయితే యీ బాలవీరునిమీద పితామహుని దృష్టి లేనేలేదు. ఆయన అర్జునునివైపు నడుపుతున్నారు రథాన్ని. అది గమనించి అర్జునుడు తాతగారిమీదికి వాడిబాణాలు నడిపాడు. ఆయన అన్నిటినీ దారిలోనే ఖండిస్తున్నాడు. వారు సాగించే యుద్ధం మావరులకు ఆనందం కలిగిస్తున్నది.

అశ్వత్థామతో భూరిశ్రవసుడూ, చిత్రసేనుడూ కలిసి అభిమన్యుని కెదురు వెళ్ళారు. హస్తలాఘవంలో, లక్ష్యభేదనంలో, పరాక్రమ ప్రదర్శనంలో, అస్త్ర ప్రయోగంలో అభిమన్యుని కౌశలం ప్రేక్షకులకు ఆనందజనకంకాగా, మనపక్షం వారికి బాధాకరంగా పరిణమించింది. కుమారుని యుద్ధనైపుణ్యం చూచి అర్జునుడు మహానందంతో సింహనాదం చేశాడు. శల్యుడు శరవర్షం కురిపిస్తుంటే ఆ ధనుస్సును ఖండించాడు అభిమన్యుడు.

ఇంతలో అర్జునుని కెదురుసాగే కృపాచార్యుని ఎదుర్కొని ధృష్టద్యుమ్నుడ ధనుస్సునూ. రథాశ్వాలనూ నేలకూల్చాడు. అని చెపుతూండగా ;

ధృతరాష్ట్రుడు - సంజయా ! పురుషకారం కంటె దైవం బలీయమని ఎరు మనవారు అసంఖ్యాకంగా నేలకూలడానికి యిదే హేతువు. సరే! తరువాయి కథ అన్నాడు.

మహారాజా ! అప్పుడు శల్యుడు ఎదురురాగా ధృష్టద్యుమ్నుడు వానితో తలప దుర్యోధనుడు కూడా వచ్చి వారి సేనాపతిని ఎదురుకున్నాడు. భీమసేనుడు గదా పైకెత్తి ఒకే ఒక్క శిఖరం వున్న కైలాసగిరిలా దుర్యోధనునివైపు వస్తున్నాడు. మనగ దుర్యోధనునికి అండగా వెళ్ళింది. అదిచూచి భీమసేనుడు గదాదండంతో క్రిందికి భీకరంగా గర్జించి విహారం ఆరంభించాడు. వానికి సహకారంగా, నకుల, సహదే అభిమన్యుడూ వచ్చారు.

వారు విడిచే భల్లాయుధాలు ఏనుగులమీది వీరుల శిరస్సులను ఎగురగొడు మిగిలిన ఆకారాలు చివరలుతెగిన చెట్లవలె కనిపిస్తున్నాయి. అప్పుడు వచ్చిన ధృష్టద్యు మన ఏనుగులను చిత్తుచేస్తున్నాడు.

అప్పుడు మగధరాజు తన మత్తేభాన్ని అభిమన్యుని మీదికి నడిపాడు. ఒకే బాణంతో ఆ మత్తగజాన్ని నేలకూల్చాడు అయినా మాగధుడు నిశ్చలంగా నిలబడ మరొక్క బల్లెం విడిచి వాని శిరస్సు ఖండించాడు.

ఇక భీమ గదా ఘాతాలకు మన గజ బలం చెల్లాచెదరవు తున్నది. క దంతాలు విరిగిపోయాయి. కొన్నిటి తొండాలు ఊడిపోయాయి. కొన్నిటి కుంభస్థలాల లయాయి. అటూ ఇటూ ఊగిపోతూ భయానక ఛీత్కారాలతో కొండల్లా పడుతునా అప్పుడు మన గజబలం అలజడి మనవారికే ప్రాణసంకటం అయింది గదా దండంతో భీమసేనుడు శూల పాణియైన రుద్రునివలె కనిపిస్తున్నాడు.

ఆ వీరవిహారాన్ని ఆపడానికి భీష్ముడు స్వయంగా వచ్చాడు. ఆయన శర కురిపిస్తున్నా భీముడు నిర్లక్ష్యంగా పోరుతూనే వున్నాడు. వానికి సాయపడవచ్చిన సాత అలంబుసుడు ఢీకొన్నాడు. సాత్యకి ధాటికి అలంబుసుడు అలసిపోగా, భూరిశ్రవసుడు సాయం వచ్చాడు.

ఇటు నీ కొడుకులందరూ భీమసేనుని మీదికి తీవ్రక్రోధంతో రాగా ఆ ఒ డొక్కడూ వారిని హింసిస్తున్నాడు.

పోరు తీవ్రం కాగా, భీమసేనుడు తన సారథితో, విశోకా! వీరు నన్ను తుద ముట్టించాలనుకుంటున్నారు. వీరికి కాలం మూడింది. సావధానంగా వుండు, వీరందరి మృత్యువూ నీ కళ్ళతో చూస్తావు – అన్నాడు.

దుర్యోధనుడు ఆ సారథిని వేధించడంతో భీముడు మరింత కోపంతో మన వాని ధనుస్సు ఖండించాడు. మరొక ధనుస్సుతో నీ కుమారుడు వాడి బాణాలు గుప్పించగా అవి భీముని వక్షస్థలాన్ని వేధించగా, దుస్సహమై రథంమీద కూలబడ్డాడు. అది చూసి అభిమన్యుడు దుర్యోధనుని నిలువరించి ప్రక్కగావున్న శల్యునికి కూడా అడ్డు తగిలాడు. ఆ వ్యవధిలో భీముడు తేరుకుని విజృంభించాడు.

పదునయిన నాసికాగ్రంతో సాగే గరుడుడు పక్షి సమూహంలో ప్రవేశించినట్లు, పశువుల మందలో తోడేలు విహరించేటట్లు భీముడు మనసేనమీద విరుచుకు పడ్డాడు. నీ కొడుకులు పదునలుగురు వాని బాణాలకు ఆహుతి అయారు. అది చూసి భీష్ముడూ, వాని వెంట మత్తేభం మీద భగదత్తుడూ వచ్చారు. అభిమన్యుడు భగదత్తుని మత్తేభాన్ని వాడి బాణాలతో హింసించాడు. అది రక్తధారలు స్రవిస్తున్నా లక్ష్యపెట్టకుండా ముందుకు వస్తూనే వుంది. సూర్యుని అరుణకిరణాలు సోకిన నల్లమబ్బులా వుంది. అది అలానే ముందుకు వస్తూంటే పాండవసేన కకావికలయింది. అప్పుడు భగదత్తుడు విడిచిన బాణం భీమసేనుని తీవ్రంగా వేధించింది. భీముడు మళ్ళీ మూర్ఛపోయాడు. అంతతో భగదత్తుడు సింహ గర్జన చేయగా ఘటోత్కచుడు తన అనుచరులతో భగదత్తుని మీదికి వచ్చాడు. ఆ అసుర సమూహంలో ఉన్న ఏనుగులన్నీ నాలుగుదంతాలవి. వాటితో పోరు దుస్సహమైంది. సాయంకాలం అవుతోంది. అది గమనించి ద్రోణునితో భీష్ముడు - ఆచార్యా! ఈ సంధ్యా సమయం అసురులకు అనుకూల మయినది. కనుక యుద్ధం విరమించండి - అన్నాడు.

మరునాడు మనసేన మకరవ్యూహంలో నిలువగా వారు శ్యేనవ్యూహం పన్నారు. ఆ వ్యూహంలో భీమసేనుడు ముందున్నాడు, నేత్రాలుగా శిఖండి, ధృష్టద్యుమ్నుడు వున్నారు సాత్యకి శీర్ష స్థానంలో వున్నాడు. కంఠ భాగాన అర్జునుడూ, అక్షౌహిణి సేనతో వామ పక్షాన ద్రుపదుడూ మరొక అక్షౌహిణీతో దక్షిణాన కేకయుడూ, ఉపపాండవులతో అభిమన్యుడూ పృష్ఠభాగాన, ఆ వెనుక నకుల సహదేవులతో ధర్మరాజూ వున్నారు.

మత్తేభ ఘీంకారాలు, జాత్యశ్వ హేషారావాలు యోధసింహ గర్జనలు, ధనుష్టంకా రాలు, రణ భేరీ ధ్వానాలు .... వీటితో భూమ్యాకాశాలు దద్దరిల్లుతున్నాయి. భీముని కెదు రుగా భీష్ములవారున్నారు. వారిమధ్య సాగిన సంగ్రామంలో పాండవ సైనికులు అసంఖ్యా

కంగా నేలకూలారు. నాడు మన పితామహుడు మధ్యందిన మార్తాండ సదృశంగా విజ
భిస్తున్నాడు. మత్తేభాలు తమతొండాలు ఎత్తిపెట్టి రథ పతాకాలను విరిచి, రథికుల కేశాల
చుట్టబెట్టి నేలకీడుస్తున్నాయి.

అలా సాగే యుద్ధంలో ఒకనాడు భీముడు రథం దిగి మనసేనలో విరుచుకుపడ్డా
సోదరులతో దుర్యోధనుడు వాని కెదురు నిలిచాడు.

బాణాలు సుడి గుండాలుగా, రక్తం ప్రవాహ జలంగా, ఏనుగులు ద్వీపాలు
గుర్రాలు కెరటాలుగా, రథాలు నౌకలుగా, రణరంగం సాగరంలా వుంది. భీముడు వి
బాణధాటికి ఆగలేక దుర్యోధనుడు మూర్ఛితు డయాడు. ఆయుద్ధంలో మన సైనికు లెంద
మరణించారు. రక్తంతో తడియని వీరుడు లేడు.

ఆ తరువాయి జరిగిన యుద్ధంలో భగదత్త-భీమసేనులకూ, భీష్మ - అభిమన్యుల
జరిగిన పోరు అత్యంతాశ్చర్యం కలిగించింది. అర్జునునికి నాగకన్య ఉలూచి వల్ల కలి
ఇరావంతుడు నిహతుడయిన వార్తతో ఘటోత్కచుడు తీవ్ర కుపితుడై సంహారకా
సాగిస్తున్నాడు.

ఎలా అయిన ఘటోత్కచుని సంహరించాలని వారంతా పూనుకున్నారు. ముఖ్యం
భగదత్తుడు ఘటోత్కచునితో తలపడ్డప్పుడు అది చూడముచ్చటగా వుంది.

ఆ రోజున దుర్యోధనుడు కర్ణుని పిలిచి, మిత్రమా! నువ్వు రణరంగానికి రాకపో
మనవారికి ధైర్యం చాలడం లేదనగా, కర్ణుడు తన శపథాన్ని త్రిప్పుకో లేనన్నాడు.

మరునాటి సంగ్రామంలో భీష్మ పితామహుని ధాటి పాండవసేనను చీకాకు పరు
న్నది. హాహారవాలు రేగుతున్నాయి గజబలం, అశ్వికదళం నేల పాలవుతున్నది. కృష్ణు
రథాన్ని భీష్ముని కెదురుగా నడిపించాడు. వారి మధ్య సమ యుద్ధం సాగింది. అది చూ
వాసుదేవుడు రథం దిగి, భీష్మ సంహారానికి వస్తున్నాడు. అది చూసి, అర్జునుడు త్వ
త్వరగా వచ్చి కృష్ణుని పట్టుకుని :

బావా! ఏమిటిది! నువ్వు తిరిగిరా, ఈ సేనాపతిని నేను కడ తేరుస్తాను-అన్నా
కృష్ణుడు తిరిగి సారథ్యం సాగిస్తున్నాడు.

పితామహుడు మరింత క్రోధంతో విజృంభిస్తున్నాడు. ఆ రోజున ఆయన పాండ
సేనా వనాన్ని దావాగ్నిలా చుట్టుముట్టాడు. ఆయన బాణపు దెబ్బతినని యోధుడు లే
నాడు. అంతలో ప్రదోషకాలం కాగా సేనలు శిబిరాలు చేరాయి.

ఆ రాత్రి ధర్మరాజు –

కృష్ణా! ఈ పితామహుడు తక్షకునివలె విషాగ్ని జ్వాలలు కురిపిస్తున్నాడు. ఈయనను ఎదుర్కోవడం మా తరం కాదు - అనడంతో వాసుదేవుడు

ధర్మనందనా! భీష్మపితామహుని మరణంతో విజయం మనదే అని నువ్వనుకుంటే, రేపు నేనే ఆ పని చేస్తాను. అయితే అది మీకు కీర్తికరం కాదే! అన్నాడు.

అనంతరం చాలసేపు మంత్రాంగం సాగించి, పితామహుని దగ్గరికే వెళ్ళి, ఆయన పాదాలకు నమస్కరించి, తాతా! మాకు విజయమార్గం చెప్పు – అన్నారు.

అప్పుడు భీష్ముడు - నాయినా! రణరంగంలో కవచం విప్పి, అస్త్రశస్త్రాలు వదలిన వానితో నేను యుద్ధం చెయ్యను. స్త్రీలతో యుద్ధం చెయ్యను. నీచుని మీద బాణం సంధించను. అమంగళ సూచక రథధ్వజం వున్నవాడితో యుద్ధం చెయ్యను. ఈ లక్షణాలన్నీ వున్న శిఖండిని ముందుపెట్టి నన్ను ఓడించండి అన్నాడు. అందరూ ఆయనకు మరోమారు పాదాభివాదం చేసి, ఆశీర్వాదాలు పొంది వచ్చారు.

## శరతల్పం

తెల తెలవారుతున్నది.

యోధులందరూ మహోత్సాహంతో రంగస్థలం మీద ప్రవేశించారు. పోరు ప్రారంభమయింది నాటి యుద్ధంలో అటూ ఇటూ అసంఖ్యాకంగా మారణహోమం సాగింది.

శిఖండిని ముందుంచుకొని అర్జునుడు వచ్చాడు. ఒకవంక భీమసేనుడు, మరొక వంక సాత్యకి, నకుల, సహదేవులూ, సృంజయ పాండవవీరులు వారి వీరవిహారం మన సేనలను చెల్లాచెదురు చేస్తున్నది. పితామహుని ధనుస్సు నిరంతరం మండలాకృతిలో గోచరిస్తున్నది. ఆయన మీదికి శిఖండి వాడి, వాడి బాణాలు విడుస్తున్నా ఆయన వాణ్ణి లక్ష్య పెట్టడం లేదు.

అంతలో గాండీవ జ్యావల్లీరవం ఉభయసేనలనూ భయభ్రాంతులను చేసింది. వానికి తోడు భీముని సింహగర్జనలు, అటు ధృష్టద్యుమ్నుడూ, ఘటోత్కచుడూ ఎదురులేని ప్రచండ వాయువువలె విక్రమిస్తున్నారు.

ఆ సమయంలో సుయోధనుడు – తాతా! నా ఆశలన్నీ మీ మీదనే వున్నాయి. మీరు ఉదాసీనంగా కనిపిస్తున్నారు – అనగా, ఆయన :

నాయనా, రోజుకి పదివేలమంది యోధులు నా వంతు. అందులో లోటు జరగడం లేదే! అన్నాడు.

నీ కొడుకులందరూ ఆయన రక్షణకు వచ్చారు. వారి యోధులు ఆయనను చుట్టు ముట్టారు. దుశ్శాసనుడు అర్జునుని కెదురు వెళ్ళాడు. వాని రథ, ధనుస్సులను భగ్నం చేశాడు పార్థుడు. అంతలో దుశ్శాసనుడు గాంగేయుని రథంమీదికి వెళ్ళాడు.

సాత్యకిని అలంబుసుడు ఎదుర్కొన్నాడు. అంతలో భగదత్తుడు సాత్యకిని ఆహ్వానించాడు. కాంభోజనరపాలుడు అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అశ్వత్థామ విరాటరాజుతో, సహదేవుడు కృపాచార్యునితో, వికర్ణుడు నకులునితో యిలా పోరు ఘోరమయింది.

పొద్దు పెరిగింది. ఆ సమయంలో భీష్ముడు: సుయోధనా! ఈనాడు అర్జునుడు ఈ కురువృద్ధుని కడతేర్చే సంకల్పంలో వున్నాడు. నా ధనుస్సు కంపిస్తున్నది. బాణాలు సరిగా చేతికి రావడం లేదు. ఈ దుర్నిమిత్తాలు .... అని ఆగాడు.

దానితో నీ కొడుకులు అప్రమత్తులై భీష్మరక్షణలో నిలిచారు. పితామహుడుకూడా ఉప్పొంగే సముద్రంవలె పాండవ తటాన్ని ముంచెత్తుతూనే వున్నాడు.

అశ్వత్థామను సాత్యకీ, దుర్యోధనుని అభిమన్యుడూ, జయద్రథుని విరాటుడూ, శల్యుని ధర్మరాజూ ఎదుర్కొన్నారు. మన గజబలం భీముని కెదురు. వీరుల సింహగర్జనలతో, ఏనుగుల, గుర్రాల, రథాల దూకుడుకు రేగిన ధూళితో నిండింది రణస్థలి.

రథమే అగ్నిశాలగా, ధనుస్సు జ్వాలగా, ఖడ్గ, బాణ, పరశు, పట్టిసాయుధాలు ఇంధనాలుగా భీష్ముడు దహనకాండ సాగిస్తున్నాడు.

అటు అర్జున విహారంలో మనసేనలు చెల్లాచెదరవుతున్నవి, అని సంజయుడు అంటూండగా ధృతరాష్ట్రుడు: సంజయా! ప్రతిపక్షం అలా విజృంభిస్తుంటే కురువృద్ధుడు తన ప్రతాపాన్ని ప్రకటించలేదా! శిఖండి రథం ముక్కలు ముక్కలు కాలేదా! ధనుస్సు ఛిన్నాభిన్నం కాలేదా! అని ప్రశ్నించగా:

మహారాజా! భీష్ములవారు దావాగ్నిలా పాండవారణ్యాన్ని ధ్వంసం చేస్తూనే వున్నారు. ఆయనకు ఎదురు రావడానికి ఎవరూ సాహసించలేక పోతున్నారు. శత్రువులకు ఆయన యమధర్మరాజులా కనిపిస్తున్నాడు.

తన సేన చెల్లాచెదరవుతూంటే అర్జునుడు తీవ్రక్రోధంతో, సింహగర్జనచేసి, గాండీవ ధనుష్టంకారం చేశాడు. ఘటోత్కచుడూ, ధృష్టద్యుమ్నుడూ తీవ్రంగా విక్రమించి మన

సేనను యమసదనానికి పంపుతూంటే చూచిన దుర్యోధనుడు –

తాతా! మీమీద ఆశలు పెంచుకున్న మాకు ఉత్సాహం కలిగిస్తూ, మీరు శత్రు వాహినిని నిరోధించాలి - అని ప్రార్థించాడు.

ఆయన మరింత క్రోధంతో ముందుకు సాగుతూంటే సాత్యకి ఎదురు వచ్చాడు. సాత్యకిని అలంబుసుడు ఎదుర్కొన్నాడు. మరొకవంక ద్రోణాచార్యుడు పాండవసేనను ఊచకోతకోస్తూ, ఒక్కసారి భీష్మునిచూసి, పక్కగా వున్న అశ్వత్థామతో,

నాయనా! ఈ రోజు సవ్యసాచి తీరు చూస్తూంటే కురువృద్ధుని నేలకూల్చే వరకూ విశ్రమించేలా లేడు. దానికి సూచనగా నాకు దుర్నిమిత్తాలు గోచరిస్తున్నాయి. అర్జునుడు మహాబలిష్ఠుడే కాక సహన శక్తిగల మనస్వి. వాడు స్థిర చిత్తంతో వస్తున్నాడంటే ఈరోజు మహోపద్రవం తప్పదన్న మాటే. అందుచేత నువ్వు ఆచార్యులకు రక్షణలో వుండు. చాలా అప్రమత్తంగా వుండాలి - అన్నాడు.

శిఖండిని ముందుంచుకుని గాండీవి రానే వచ్చాడు. అర్జునుడు బాణాల వల పన్నాడు. అందులో మనసేనలు చేపల్లా పడుతున్నాయి. ఆచార్య ద్రోణులూ, అశ్వత్థామా కూడా పితామహుని దగ్గరే వున్నారు. దుర్యోధనునితో సహా అతని సోదరులు తాతగారికి రక్షకశ్రేణిలో నిలిచారు.

అభిమన్యుడు దుర్యోధనుని కెదురు నిలిచాడు. అశ్వత్థామ సాత్యకిని నిలబెట్టాడు. ద్రోణునితో ధృష్టద్యుమ్నుడు పోరాడుతున్నాడు.

శిఖండి తీవ్రంగా బాణాలతో భీష్ముని హింసిస్తున్నాడు. ఆయన కన్నులలో విస్ఫులింగాలు రేగు తున్నాయి. ఒక్క బాణం కూడా ఆయన శిఖండిపై విడవడం లేదు. ఆ సమయంలో

కృష్ణుడు : గాండీవీ! ఆయన మారణహోమం సాగించే సమయంలోనే నువ్వు ఆ యోధుని సంహరించి కీర్తి కాంతను వరించు-అనగా అర్జునుడు ధనుర్వర్షంతో పితామహుని ముంచెత్తాడు.

శిఖండి ఆయన ధనుస్సు ముక్కలు చేశాడు. ఆయన కవచం తెగిపోయింది. శరీరం తూట్లు పడుతున్నది. తొమ్మిది వాడి బాణాలు ఒక్కసారి విడిచాడు శిఖండి. ఆయన వక్షస్థలంమీద నాటుకున్నాయవి; కాని ఆయన పర్వతంలా అచంచలంగా నిలబడ్డాడు. మరొక మారు బాణాలు విడిచాడు. తూట్లుపడుతున్నది ఆయన దేహం. అయినా శిఖండిని చూడకుండా ఇతర యోధులను నిరోధిస్తూ పక్కనే వున్న దుశ్శాసనునితో -

నాయనా ! ఈ వాడి బాణాలు గాండీవం నుండి వస్తున్నట్లున్నాయి, లేకపోతే యింత బాధ కలిగేది కాదు - అన్నాడు.

సూర్యుడింకా అస్తమించ లేదు. అస్తాద్రికి అంతంత ఎడంలో వుండగా హాహారవాలు మిన్ను ముట్టాయి. ఆయన నేల కూలాడు. శరీరమంతా బాణాలు నాటి వుండడంవల్ల ఆయన దేహం భూమికి తగుల కుండా, ఆ బాణాలే శయ్యగా వొరిగాడు. మన సేనలు హాహాకా రాలు చేయగా, శత్రువులు హర్ష ధ్వానాలు చేశారు.

అందరూ శస్త్రాస్త్రాలు విడిచేశారు. నీ కొడుకులే కాదు, అటు వారున్నూ విచార సాగరంలో మునిగారు. అందరూ ఆయన చుట్టూ చేరి తలలు వంచి నిలబడ్డారు, అప్పుడు భీష్ముడు—

నాయనా ! ఈ దక్షిణాయనం నడిచి ఉత్తరాయణం వచ్చేవరకూ నే నిలానే వుండాలి ప్రస్తుతం ఈ అంపశయ్య నాకు సుఖంగా వుంది. అయితే తలకింద తలగడ కూడ అని అంటూండగా సవ్యసాచి, బాణాలతోనే తలగడా అమరించాడు.

అప్పటికి శల్యతంత్రం ఎరిగిన చికిత్సకులు రాగా, ఆయన —

నాయనా ! సుయోధనా ! ఈ వైద్యులతో మనకు పనిలేదు. ఈ బాణాలు ఇలానే వుండనిచ్చి, నేను కన్ను మూశాక వీటితోనే నన్ను దహనం చెయ్యండి— అన్నాడు.

రాత్రి పొద్దు పోయింది.

తెల్లవారుతుండగా, అందరూ చూడరాగా - భీష్ముడు, నాయనా ! దాహబాధ విప రీతంగా వున్నది. నాకు దివ్య జలాలు కావాలి-అనగా అర్జునుడు భీష్ముని దక్షిణ పార్శ్వాన భూమిలోకి పర్జన్యాస్త్రం సంధించాడు. జల ధారలు పై కుబికి దాహ శాంతి కలిగించాయి. అది చూపి, దుర్యోధనునికి మరోసారి హిత బోధ చేశాడాయన - అందరూ వెళ్ళాక కర్ణుడు రాగా —

నాయనా ! ప్రారబ్ధం పురుషకారం కంటె బలీయమైనది. సరే, నువ్వు కౌంతేయుడ వని ఎరుగుదును. కనుక వారితో కలిసి ఈ యుద్ధం ఆపు, అనగా;

పితామహా ! ఇప్పుడింక ఈ సంగ్రామం ఆగడం న్యాయం కాదు, అన్నాడు, కర్ణుడు.

నిట్టూర్చి విశ్రాంతి తీసుకున్నాడు, భీష్మపితామహుడు ఉత్తరాయణం కోసం ఎదురు చూస్తూ; అని వైశంపాయనుడు భీష్మపర్వం ముగించాడు.

ఇది భీష్మపర్వం

## ఇందులో

సేనాపతి

పద్మవ్యూహం

సైంధవ వధ

ఘటోత్కచుడు

ద్రోణవధ

## సేనాపతి

కురుక్షేత్రంలోని తన శిబిరం నుండి తిరిగివచ్చిన సంజయుడు :

మహారాజా ! పితామహుడు అంపశయ్య అలంకరించడంతో మన సేనలకు గుండె పగిలి కర్ణా ! కర్ణా ! రక్షించు అంటూ ఆర్తనాదాలు చేశారు. రాధేయుడు రంగానికి వచ్చి పితామహుని వంటి మేరువు కూలిపోయినందుకు యింత సేపు విచారించి తనను తానే ఓదార్చు కొని మీరు నిర్భయంగా ముందుకు సాగండి. నా శక్తితో పాండవ బలాన్ని పరాభూతం చెయ్యడమో లేక భీష్ముని అనుసరించడమో తప్ప మార్గాంతరం లేదు. మీ రందరూ యుద్ధ సన్నాహాలు కానివ్వండి - అని తన రథాన్ని భీష్మ పితామహుని దగ్గరకు నడిపించి ఆయనను చూసేనరికి పొంగి పొంగి ఇంకిపోయిన సముద్రంలా, రెక్కలు విరిగిన మైనాకంలా భూమిమీద పడ్డ గరుత్మంతునిలా కనపడడంతో కన్నుల నీరు కమ్మింది కర్ణునికి.

కన్నీరు ఒత్తుకుంటూ, వణుకుతూన్న పాదాలతో వెళ్ళి ఆ మహా యోధునికి సాష్టాంగ పడి నమస్కరించి —

తాతా ! బాణాలే నాలుకగా అర్జునుడనే అగ్నికి సారథ్యమే గాలి పూవుగా కృష్ణుడనే వాయువు తోడయి ఈ కౌరవ కాననాన్ని మంట పెడుతూంటే, ఆయన దేవదత్తం ఒత్తుతూ గాండీవ ధనుష్టంకారం చేస్తుంటే, ఈయన పాంచజన్యం పూరిస్తూంటే మా కెవరు దిక్కు అని దీనంగా నిలబడగా, భీష్ముడు ఆదర హాసంతో కన్నులు విస్ఫారించి చూశాడు.

అప్పుడు కర్ణుడు :

మహావీరుడా ! నువ్వు అనుజ్ఞ యిస్తే నేను వెళ్ళి బరి మీద వున్న కోడె త్రాచును మంత్రంతో బంధించినట్లు నా శస్త్రాస్త్రాలతో అర్జునుని గర్వం అణగారుస్తాను.

అన విని భీష్ముడు : కర్ణా ! సముద్ర సమ గంభీరుడవయిన నిన్నుకూడి కౌరవ నదులు ఎంతో ఘనంగా భాసిస్తాయి. రక్త బాంధవ్యం కంటె స్నేహం, సత్సాంగత్యం బలీయమయిన వని నే నెరుగుదును. నీ పరాక్రమంతోనే కదా విదేహ, పౌండ్ర దేశాధిపతులను జయించి, దుర్యోధనునికి అధీనులను చేశావు. నీ రక్షణలో మనవారందరూ సుఖ సంతోషాలు పొందు తారు. వారి విజయం కోసం ప్రయత్నించు అని ఉత్సాహ వాక్యాలు పలికి, కర్ణా ! దుర్యోధ నాదుల వలె నువ్వూ నాకు పౌత్రసముడివి. వారిమీద వున్న ప్రేమ నీ మీదా వున్నది అని సెలవిచ్చాడు.

కర్ణుడు మరొక్కమాటు ఆ సేనాపతి పాదాలకు అభివాదం చేసి, తిరిగి వచ్చాడు.

తిరిగి వచ్చిన కర్ణుని ముఖంలో "కయ్యపు వేడుక'' కనిపించ గానే కౌరవ జ్యేష్ఠుడు మహోత్సాహంతో కర్ణా! నిన్నటి వరకూ పితామహుని ధైర్య కవచంలో మనసేన నిశ్చింతగా వుంది. ఇప్పుడిక మన సేనాపతిగా తగిన వారెవరు? అన్నాడు.

ప్రభూ! మన పక్షంలో సేనాపతిత్వానికి అర్హత లేనివాడు లేడు. అయితే ఎవరిని సేనాపతిగా వరిస్తే తమకంటె వాని ఆధిక్యం ఏమిటని మిగిలినవారు అగ్రహోదగ్రులుకారో అటువంటి ఉత్తముని స్వీకరించాలి. ఈనాడు ధనురాచార్యుడు ఆ పదవికి అర్హుడు, అని కర్ణుడనగానే పెద్దలతో కలిసి, దుర్యోధనుడు ద్రోణాచార్యుని చేరి :

ఆచార్యా! పితామహుల అనంతరం ఈ సేనా భారం మీరు వహించాలి. మీ కంటె ఈ పదవికి అర్హులులేరు అని అంజలి బంధంతో అర్థించగా ద్రోణాచార్యులు ముందు వెనుక లాలోచించి, అంగీకరించాడు.

బంగారు కలశంతో పవిత్ర నదీ జలాలు తెప్పించి వేద విదుల ఆశీర్వాదాలతో ఆయనను సేనా పతిగా అభిషేకించారు. కర్ణ ప్రముఖ యోధులు శంఖ నాదాలు చేశారు. ఆ మహాయోధులు ఉత్సాహంతో వెంట రాగా ఆయన రణ రంగంలో అయిదు రోజులు తన శస్త్రాస్త్రకౌశలం ప్రదర్శించాడు. ఆ యుద్ధంలో మహా యోధు లెందరో నేల కూలినారు. ఒక అక్షౌహిణీ సైన్యం యమ సదనం చేరింది.

ఏం చెప్పను మహారాజా! ద్రుపదనందనుడు ధృష్టద్యుమ్నుడు ఆచార్యుని వీరస్వర్గం చేర్చాడు. అనడంతో ధృతరాష్ట్రుడు కొంత సేపు దుఃఖించి గుండెలు బిగ్గబట్టి —

సంజయా! మేరువు ఒరిగిందన్నా, సూర్యుడు ఆకాశం నుంచి భూమిలో కూలబడ్డాడన్నా, సముద్రాలు నీటిచుక్క లేకుండా యింకి పోయాయని చెప్పినా ఆశ్చర్యంలేదు కాని ధనురాచార్యుడు నేలకూలినాడంటే నమ్మలేకుండా వున్నాను.

సరే, ఆచార్యుని సేనాపతిగా చేసి సాగించిన సంగ్రామంలో జరిగిన విశేషాలు వివరించు అన్నాడు.

ప్రభూ! ఆయన సేనాపతి కాగానే ఏం కావాలో కోరుకోమన్నాడు దుర్యోధనుని.

ఆచార్యా! ధర్మరాజుని సజీవంగా బంధించి తీసుకు రండి, అంతే చాలు అన్నాడు.

నాయనా! యుద్ధంలో అయినా ఆ ధర్మాత్ముని సంహరించమని నువ్వు కోరలేదంటే నిజంగా పాండవ జ్యేష్ఠుడు అజాతశత్రువే. అయితే నాయనా! ఇటువంటి కోరిక కోరుతున్నావే అలా వారిని ఓడించి, వారి రాజ్యభాగం వారి కివ్వా మనుకుంటున్నావా! అని చిరునవ్వుతో అడిగాడు ఆచార్యుడు.

ఆచార్యా! ధర్మరాజును సంహరిస్తే ఆ దుఃఖ హృదయంతో విపరీతక్రోధుడై అర్జునుడు మా వంశాన్ని నాశనం చేస్తాడు; కాక అర్జుననే నేలకూలిస్తే కృష్ణుడు చక్రధారియై మనందరినీ కూల్చి ఈ రాజ్యాన్ని కుంతీదేవికి ధారవోస్తాడు. అందుచేత ధర్మరాజును బంధించి తెస్తే ఆయనతో మరొక్కమారు జూదం ఆడి మళ్ళీ అరణ్యవాసం .... అని చిరునవ్వు నవ్వాడు దుర్యోధనుడు.

నాయనా! నా ప్రతిజ్ఞానుసారం నువ్వు కోరిన వరం నెరవేర్చాలి. సరే, అర్జునుడు ఎదురు వస్తే మాత్రం అది నా సాధ్యం కాదు; వాడు ఏమరి వున్నాడో, పాంచాలసేన ఎంత ఎదురుగా వున్నా నిశ్చింతగా ధర్మరాజును నీ ముందు బందీగా వుంచుతాను — అన్నాడు.

ఈ వార్త పాండవ స్కంధావారంలో తెలియగానే ధర్మరాజు అర్జునుని పిలిపించి ఆచార్యుని ప్రతిజ్ఞ వివరించి, ఒక్క క్షణమయినా యుద్ధ భూమిలో తనను విడిచి వుండరాదనీ ఆ విధంగా దుర్యోధనుని సంకల్పం విఫలం చెయ్యాలనీ అన్నాడు. అప్పుడు అర్జునుడు తన కంఠంలో ప్రాణం వుండగా ధర్మరాజుని బంధించడం ఏ ప్రాణికీ సాధ్యం కాదన్నాడు.

తెల్లవారగానే అందరూ రణరంగానికి మహోత్సాహంతో వచ్చారు. పాండవసేన క్రౌంచ వ్యూహంలో ఉంది. శకట వ్యూహం పన్నారు కౌరవులు.

అటు కర్ణుడూ, ఇటు అర్జునుడూ మహోత్సాహంతో తమ సేనలకు ఉద్రేకం కలిగిస్తున్నారు. వారిద్దరూ ప్రచండ సూర్యులవలె వెలుగుతున్నారు.

నాటి యుద్ధం ప్రారంభమయిన కొద్ది క్షణాలలో ఆచార్య ద్రోణులు విజృంభించారు. ఆయన రథం అతి విచిత్రంగా సాగుతున్నది. అది ఎటు చూస్తే అటే కనిపిస్తున్నది ప్రతి వ్యక్తికీ ద్రోణ రథం తమ కెదురుగా వున్నట్లే అనిపిస్తున్నది. తల నెరిసిన ఆ వృద్ధ యోధుని కెదురుగా అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ నిలబడ్డారు. శకుని ఎదుట సహదేవు డున్నాడు. ఆ వంక అసురయోధుడు అలంబుసుడు మనపక్షాన పరాక్రమిస్తూంటే వారివంక ఘటోత్కచుడు ప్రతిఘటిస్తున్నాడు.

విరాటరాజుతో కర్ణుడూ, భగదత్తునితో ద్రుపదుడూ, సైంధవునితో అభిమన్యుడూ తమ తమ శస్త్రాస్త్రవిద్యాకౌశలం ప్రదర్శిస్తున్నారు. అప్పుడు మన సైంధవుడు అభిమన్యుని దెబ్బ తిని ఊపిరి సలుపుకోలేక పిక్కబలం చూపడంతో వారి పక్షంవారు ఆ కుమారయోధుని ప్రశంసిస్తూ సింహనాదాలు చేశారు. అది మనవారికి అవమానం అయింది. అప్పుడు శల్యుడు అభిమన్యునికి ఎదురు నడిచి, గదా దండం గిరగిర త్రిప్పాడు, అని సంజయుడు గుక్క తిప్పుకుంటుండగా

ధృతరాష్ట్రుడు : సంజయా! తరతరాల ప్రజలు నోరూర చెప్పుకుని చెవులార విన వలసిన యుద్ధం యిది. చెప్పు, చెప్పు. ఇంత విచిత్ర సంగ్రామ క్రీడ ఇంతకు ముందెవరూ సాగించి వుండరు. ఇక ముందు సాగుతుందనే నమ్మకమూ లేదు, అనంతర కథ కానియ్యి, అని హెచ్చరించాడు.

సంజయుడు గొంతు సవరించి, ప్రభూ! ఆ సమయంలో శల్యునితో భీమసేనుడు నడిపిన గదాయుద్ధం అత్యంత ఆశ్చర్యకర మయినది. ఒకరి గదను ఒకరి గద తాకుతూంటే మెరుపులు పుట్టాయి. ఆ ధ్వని పిడుగుల ధ్వనిని మించింది. వారు చక్ర భ్రమణం చేస్తూంటే ఆ పద ఘాతానికి భూమి దద్దరిల్లింది. ఆ ఉద్రేకంలో వా రుభయులూ భీషణ పోరాటం సాగించి, ఒకానొక క్షణంలో యిద్దరూ నేలమీద పడ్డారు. అంతవరకూ వారి పోరు చూసే వారికి భయం కలిగి, కొయ్యబారి పోయారు. అంతలో కృతవర్మ అక్కడకువచ్చి మనశల్యుని లేవనెత్తి తీసుకు వెళ్ళాడు. అప్పటికి భీముడు తేరుకుని, గద పైకెత్తి లేచాడు. అతన్ని చూస్తూనే మీ కొడుకులు బాణాలు సంధించారు. నకుల, సహదేవులు భీముని కిరు వంకలా నిలిచారు. భీముడు ప్రచండ వాయువులా విజృంభించగా, మన సేన తామర రేకుల్లా ఎగిరి పోయింది. ఆ తాకిడిని ఎదుర్కొని నిలిచినవాడు వృషసేనుడు (కర్ణసుతుడు). ఆ వీరుని కెదురుగా నకులుని కొడుకు శతానీకుడు నిలబడి, వాని రథ కేతనాన్నీ, బాణాసనాన్నీ విరగ గొట్టాడు. ఆ సమయంలో కర్ణ, కృప, ద్రోణ, అశ్వత్థామ, ధృష్టద్యుమ్న, భీమ విరాటులు సప్త సూర్యులవలె వెలుగుతూ యుద్ధం చేస్తున్నారు.

మన సేనలు వారి ధాటికి నిలువలేక వెనుదిరగ బోతూండగా ఆచార్య ద్రోణులు మనవారికి ధైర్యం పలుకుతూ ధనుష్టంకారం చేశారు, చేస్తూనే - సారథీ! ఈ చేతుల తీట వదిలేటట్లు ఒక్కసారి ప్రతిపక్షులను చెండాడుతాను. నడిపించు రథాన్ని; అంటున్నప్పు డాయన పొంగుతున్న సముద్రంలా వున్నారు. పాండవాగ్రజుని చక్ర రక్షకుడు సుకుమారు డనేవాడు ఆయనను కదలకుండా చెయ్యబోయాడు. కాని ఆచార్యుని ముందు వాడు ఆగగలడా!

ఆచార్యుడు అడ్డు వచ్చిన వారందరినీ పరాజితులను చేస్తూ ధర్మరాజు మీదికి సాగించాడు, రథాన్ని. ఆయన కన్నులు చింత నిప్పులు కురుస్తున్నాయి. ఆ నిప్పులు మన సేనకు అమృత శీతలంగా వుంటే, వారికి కాలకూట విషంగా సోకుతున్నాయి. ఆయనకు, ధర్మరాజును బంధించడానికి ఇక ఎన్నో క్షణాలు పట్టదనే అనిపించింది. అనిపించిన క్షణంలో అర్జును డక్కడ ప్రత్యక్షమయ్యాడు.

వారి మధ్య సాగిన భీకర సంగ్రామంలో నడిచిన వాడి బాణాల తాకిడికి రాలిన కపాలాలు రాళ్ళవలె, మేదోమాంసాలు బురదవలె, ఎముకల పొడి ఇసుకవలె, రక్తమే ప్రవాహ జలంగా ఆ ప్రాంతమంతా ఒకనదిలా కనిపించింది. అంతలో సూర్యుడు పడమటి కొండకు చేరాడు. నియమానుసారం నాటికి యుద్ధం ఆగింది.

తెల తెలవారుతుండగా ఉభయపక్షాల బలాలూ యుద్ధ రంగానికి బయలుదేరే వేళ ద్రోణాచార్యులు :

దుర్యోధనా! అర్జునుడు ఎదురుగా వున్నంతకాలం ధర్మరాజును బంధించలేనని ముందే చెప్పాను నీకు. అందుచేత ప్రయత్నించి అర్జునుని నా ఎదుటకు రాకుండా చెయ్య గలిగితే నీ కోరిక నెరవేరుతుంది. అనగా త్రిగర్తదేశ ప్రభువు సుశర్మ :

సుయోధనా! మా మీద విశ్వాసం వుంచు. ఈనాడు మా సంశప్తక గణమో అర్జు నుడో తేలిపోవాలి. మా ప్రతాపం చూడు - అన్నాడు.

అనుకున్న ప్రకారం సుశర్మ దక్షిణ దిక్కుగా సాగుతూ సవ్యసాచిని యుద్ధానికి రమ్మన్నాడు. అర్జునుడు ధర్మరాజుని చేరి : అగ్రజా! వీరుడు యుద్ధానికి పిలిస్తే రానన్డం కంటె అపకీర్తి లేదు. ఇదిగో ఈ పాంచాల యోధుడు సత్యజిత్తు మీకు రక్షగా నిలుస్తాడు. ఈయన కంఠంలో ఊపిరి వుండగా ఆచార్యులు మిమ్ము బంధించ లేరు. విధి వికటించి, ఈ వీరుడు నేలకూలితే మాత్రం మీరు క్షణంకూడా యుద్ధ భూమిలో నిలువవద్దు - అని ఆయన అనుమతి పొంది రథాన్ని తోలించాడు.

ఆచార్యుడు పద్మవ్యూహం పన్ని ముఖ ద్వారంలో నిలబడ్డాడు. అప్పుడు ధృష్ట ద్యుమ్నుడు మండలార్ధ వ్యూహం పన్ని శంఖనాదం చేశాడు. ఎదురుగా ధృష్టద్యుమ్నుడే సిద్ధ మయేసరికి అపశకునంగా భావించాడు ద్రోణాచార్యులు.

అక్కడ అర్జునుడు ఆకలిగొన్న సింహంలా త్రిగర్తసేనా హరిణ మండలం మీదికి సాగుతూ దేవ దత్తం పూరించాడు. ఆ మహా యోధునితో వారు ఎంతోసేపు ఆగలేక వెన్ను చూపుతూ నారాయణ గోపాలక గణాన్ని శరణు వేడారు. తెల్లని మేఘంలో సాగే విమానంలా తీవ్ర వేగంతో రథం నడుపుతున్నాడు కృష్ణుడు.

నారాయణ గోపాలక గణం అర్జునునితో కృష్ణునికూడా నేలకూల్చే స్థిర సంకల్పంతో బాణవర్షం కురిపించగా ఈ గణాలు శస్త్రాలతో కడతేరేవి కావని త్వష్టప్రజాపతి యిచ్చిన అస్త్రం అభిమంత్రించి ప్రయోగించాడు. అంతతో గోపాలక గణంలో అందరికీ తమ ఎదుటి వాడు అర్జునుడనే అపోహ కలిగి ఒకరినొకరు ఖండింమకు మరణించారు.

అప్పటికి తేరుకున్న సంశప్తకులు అర్జునుని చుట్టుముట్టి తమ వాడి బాణాలతో కృష్ణుని తీవ్రంగా గాయ పరుస్తూంటే ఆయన అర్జునా! నన్ను రక్షించు, రక్షించు అని ఆర్త నాదాలు చేశాడు.

సవ్యసాచి నవ్వుతూ బాణ వర్షం కురిపించి వారందరినీ నేల పాలు చేశాడు. ఇలా ఇక్కడ కృష్ణార్జునులు సంగర క్రీడ సాగిస్తూంటే, అక్కడ ధర్మరాజుని బంధించే యత్నంలో మన వారందరూ అప్రమత్తులై వున్నారు.

## పద్మ వ్యూహం

ద్రోణాచార్యుల కెదురువచ్చే ధృష్టద్యుమ్నుని నిరోధిస్తూ మీ కుమారుడు దుర్ముఖుడు నిలిచాడు. అలా దుర్ముఖుడు ఎదుర్కొనడంతో వారు ముందుకు వచ్చారు సంకుల సమరం సాగింది. రేగిన ధూళిక సూర్య మండలం కప్పు బడింది.

పాండవ పాంచాలసేనలు ఎంతగా సాహసించినా ద్రోణాచార్యుని వైపు అడుగు ముందుకు వెయ్యలేకపోతున్నాయి. అప్పుడు ధర్మరాజు అభిమన్యుని సమీపించి :

నాయనా! ఆచార్యులు పన్నిన ఈ పద్మవ్యూహంలో ప్రవేశించే విద్య కృష్ణార్జును లకూ, ప్రద్యుమ్నునికీ, నీకూ తప్ప మరెవరికీ తెలియదు. అందుచేత నువ్వు ముందుదారి ఏర్పాటుచేస్తే మే మంతా నిన్ను అనుసరించి శత్రు సంహారం సాగిస్తాము - అన్నాడు.

అనగా అభిమన్యుడు : ప్రభూ! నేను నిశ్శంకగా వ్యూహం ఛేదిస్తాను. అయితే పితృపాదులు నాకు ప్రవేశవిధానమే బోధించారు కాని, విపత్తు వస్తే ఆ వ్యూహం నుండి బైట పడడం చెప్పలేదు. అయినా ఇప్పుడా ప్రసక్తిలేదు. ఇదిగో నా రథాన్ని అటే నడిపిస్తాను, అని సారథివైపు తిరిగి రథాన్ని తీవ్ర వేగంతో వ్యూహ ముఖ ద్వారం చేర్చమని అజ్ఞాపించాడు.

వడివడిగా సుడులతో ప్రవహించే గంగానది సముద్రంలో ప్రవేశించి నట్లయింది. అభిమన్యుడు కౌరవ సేనలో ప్రవేశించడంతో కౌరవ సేనలోని మహా యోధు లెవరూ వాని రథ వేగాన్ని నిరోధించలేక పోయారు.

అప్పుడు సాగిన యుద్ధంలో గరుత్మంతుడు అయిదుతలల పామును చీల్చి ముక్కలు చేసినట్లు మన కురు సేనలను ఆ యువవీరుడు చెండాడాడు. వానిని నిలబెట్టడానికి వచ్చిన శల్యుడు విఫలుడయాడు. ఆ వీరునికి ఎదురువచ్చిన వారిలో బ్రతికి బయటపడ్డవారు అరుదే. రణ భూమి అనే సరోవరంలో యోధ వరుల శిరస్సులు పద్మాలవలె ఉన్నాయి. మణి రత్న కాంతులీనే కిరీటాలు కల రాజుల శీర్షాలు మరీ శోభాయమయంగా వున్నాయి.

ఆ దృశ్యాన్ని చూసిన ఆచార్య ద్రోణులు కృపాచార్యులతో: చూడండి ఈ బాల యోధుడి పరాక్రమం. బంతులాటలా వుంది వాడికి రణ రంగంలో శత్రు సంహారం. ఎంత కౌశలం ప్రదర్శిస్తున్నాడో! ప్రగల్భాలు పలికిన మన యోధులెవడూ వానిముందు నిలవలేక పోతున్నారు. ప్రళయ కాలంలో రుద్రుడూ, అసురసంహారవేళ కుమారస్వామీ యిలా వుండే వారేమో, చిరునవ్వు చెక్కుచెదరకుండా చేస్తున్నాడు యుద్ధం - అని ప్రశంసించాడు.

అది విన్నాడు మీ పెద్దకొడుకు. విని తనచుట్టూ వున్న యోధులందరినీ చూస్తూ ఆచార్యులవారు శిష్యవాత్సల్యం అర్జునుడి మీదనే కాక అభిమన్యుని మీద కూడా చూపు తున్నారు. కాకుంటే వారికి ఈ యువవీరు డొక లెక్కయా! నడవండి మన మందరం కలిసి వాడి శిరస్సు ఖండిద్దాం అన్నాడు.

అప్పుడు దుశ్శాసనుడు: అగ్రజా! ఆ పని నా మీద పెట్టు - అని రథాన్ని అభి మన్యుని వైపు నడపించాడు. యోధులందరూ అటే సాగారు.

క్షురప్ర, వత్సదంత, విపాఠ, అర్ధచంద్ర బాణాలు అభిమన్యుని ధనుస్సు నుండి వస్తూంటే మనవారు కట కట లాడుతున్నారు. సూర్య కిరణాలు ప్రపంచమంతా వ్యాపించి నట్లు ఆ వీరుడు విడిచే బాణాలు రణరంగం అంతా గోచరిస్తున్నాయి

మృదంగ, దుందుభి, క్రకచ, భేరీనాదాలు మ్రోగుతున్నాయి. మహావీరుల సింహ గర్జనలు, హయ హేషలు, మత్తేభ ఘీంకారాలు, ధనుష్టంకారాలు, శంఖ ధ్వానాలు భూన భోంతరాలు దద్దరిల్లుతున్నాయి

ఎదురువచ్చిన దుశ్శాసనుని ధనుస్సు రెండు ముక్కలు చేసి అభిమన్యుడు: దుశ్శా సనా! ఏమయింది నీ వీరప్రతాపం. నిష్ఠురాలూ నిందలూ పలుకుతూ ప్రగల్భాలు పలకడం కాదు యుద్ధం. జూదంలో మోసగించగలవు కాని రణరంగంలో సాగదది. నువ్వు చేసిన అన్యాయాలకు అక్రమాలకూ అఘాయిత్యాలకూ అంతం వస్తున్నది - అని నవ్వుతూ బాణం విడిచాడు.

ఆ వేగానికి దుశ్శాసనుడు మూర్ఛపోయాడు. అది చూసి దుర్యోధనుడు కర్ణుని వైపు చూడగా ఆ మహావీరుడు అభిమన్యునికి ఎదురు వెళ్ళాడు. దుశ్శాసనుని రథం రణ రంగానికి దూరంగా సాగింది.

క్షణాల వ్యవధిలో కర్ణుని ధనుస్సు రెండు ముక్కలు కావడంతో వాని సోదరుడు అభిమన్యునితో పోరు సాగించి పాండవవీరుని రథధ్వజాన్నీ ఛత్రాన్నీ ఖండించి, సారథిని

గాయపరచడంతో కుపితుడై అభిమన్యుడు నారి సారించి విడిచిన బాణం మనయె శిరస్సును నేలమీద పెట్టింది. అప్పటికే కర్ణుడు అలసి రణ రంగానికి దూరంగా వెళ కర్ణుడే అలా కావడంతో మన వారికి ధైర్యం సన్నగిల్లింది. అభిమన్యుని బాణాలు మిం దండులా వస్తున్నాయి. మండు వేసవికి ఎండిన అడవిలో నిప్పు రవ్వ పడి మంట బే అభిమన్యుని బాణాలు మన సేనను కాలుస్తున్నాయి.

ఆ సమయంలో వీరుడు దేవేంద్రునివలె వున్నాడు. దేవసేనను నడిపిన కు స్వామిలా వున్నాడు అని సంజయుడు చెపుతూంటే ధృతరాష్ట్రుడు సంజయా! ఆ యో ఒక్కడే కనిపిస్తున్నాడు, మిగిలినవారు ఏమయినట్టు? అన్నాడు.

ధర్మజ, భీమ, నకుల, సహదేవులు యితర యోధులతో వ్యూహం ఛేదించ రావడానికి చేసే ప్రయత్నాన్ని సైంధవుడు విఫలం చేశాడు. వనవాస సమయంలో జ పరాభవానికి ప్రతీకారం కోసం తీవ్ర తపస్సు చేసి శంకరునివల్ల పొందిన వర శక్తితో అల్లుడు ఆ రోజున వారిని ముందుకు సాగ నివ్వ లేదు.

ఆ సంగ్రామంలో భీముని రథాన్ని కూడా ముక్కలు చేశాడు సైంధవుడు. అప్ప మనవారి ఆనందానికి అవధులు లేవు. గజబలాన్ని చెల్లాచెదురు చేసి అభిమన్యుడు ఏ చిన బాటను సైంధవుడు మూసేశాడు. పాండవ బలం కదల లేకుండా వుంది.

వ్యూహంలో అభిమన్యుడు ఆకలిగొన్న పులిలా విక్రమించి శత్రువులను లేడిక వలె వేటాడుతున్నాడు. మహాసాగరంలో తిమింగిలం నోరు తెరిచి జలచరాలను భక్షిస్తున్న ఆ యోధుడు మన సేనను హతమారుస్తున్నాడు. మన సేనలో సత్యశ్రవుడు నేలకూలా రుక్మరథుని శిరస్సు గాలిలో బంతిలా ఎగిరింది. అప్పుడు మన వీరులు విడిచిన బాణ గుచ్చుకుని ఆ వీరుని రథాశ్వాలు బలిసిన ముళ్ళపందుల్లా వున్నాయి.

అభిమన్యుని వీర విహారాన్ని సహించలేక మనవారందరూ పిక్క బలం చూ తున్నారు. అప్పుడు మీ మనవడు లక్ష్మణకుమారుడు సాహసంతో ఎదురు వెళ్ళాడు.

వా రుభయులూ మత్తేభాలవలె పోరుతున్నారు. కొంత సాగినాక అభిమన్యుడ లక్ష్మణకుమారా! ఇంక చివరకు వచ్చావు. ఒక్కమారు బంధుమిత్రులలో నీకు కావలసి వారందరినీ కళ్ళారాచూసుకో. శాశ్వతంగా కన్ను ముయ్యబోయే ముందు నీ కోరిక తీర కోనిస్తున్నాను. అంటూ విడిచిన వాడిగల భల్లం మనబాలుని శిరస్సును ఆకాశానికి తీసు పోయింది

అప్పుడు కర్ణుడు ఎదురు వచ్చాడు. వా రుభయులూ ఒకరినొకరు బాణ వర్షంతో ముంచెత్తుతున్నారు. ఇద్దరూ నిండుగా విరిసిన పూలతోవున్న మోదుగుచెట్ల వలె వున్నారు. ఈ విధంగా పోరు సాగిస్తూనే మన వారిలో ఘటికులయిన అశ్వకేతునీ, శత్రుంజయునీ, చంద్రకేతువునూ, మేఘవేగునీ, యమపురికి పంపి శల్యుని రథధ్వజాన్ని ఖండించి పార్శ్వ రక్షకులను మన్ను కరిపించాడు.

ఈ ఆటోపం చూసి శకుని దుర్యోధనుని సమీపించి మనం ఉపాయాంతరం ఆలోచించి వీణ్ణి కడతేర్చాలి అన్నాడు.

అదే సమయానికి కర్ణుడు ఆచార్య ద్రోణులను చేరి :

ఆచార్యా! వీర ధర్మానుసారం నే నిక్కడ పోరు సాగిస్తూన్నానే కాని ఈ బాల వీరుణ్ణి ఎదుర్కోవడం మన తరం కాదు. నా రొమ్ము చీలుస్తున్నాడు వీడు, అనగా

కర్ణా! అర్జునునికి నేను అభేద్య కవచవిద్య యిచ్చాను. అది వీడు ధరించి వచ్చాడు. అయితే ఇప్పుడు మనలో ఎవరమూ విడి విడిగా వాని ముందు నిలబడలేం. నువ్వు వెళ్ళి రథాన్నీ ధనుస్సునూ ఛిన్నాభిన్నం చెయ్యి — అన్నాడు.

మహారథికులందరూ అభిమన్యునివైపు నడిచారు. కర్ణుడు ధనుస్సు ఖండించాడు. కృతవర్మ రథాశ్వాలను నేలకూల్చాడు. కృపాచార్యుడు పార్శ్వ రక్షకులను హతమార్చాడు.

అంతతో ఆ వీరుడు డాల్‌కత్తులు చేబూని గగన వీధికి ఎగిరాడు. మన మహా రథికులు ఆరుగురు వాని కెదురున్నారు. ఆచార్యులవారు ఆ ఖడ్గాన్ని తునియలు చేశారు. కర్ణుడు డాలు ముక్కలు చేశాడు. ఆయుధ శూన్యుడై నేలకు దిగి రథ చక్రం అందుకుని విక్రమించాడు.

సుదర్శన ధారియైన విష్ణువవలె వున్నా డప్పుడు అభిమన్యుడు. మనవా రందరూ కూడి ఆ రథ చక్రాన్ని ముక్క ముక్కలుచేశారు. అంతతో గదా దండం ధరించగా అశ్వత్థామ ఎదురు వచ్చాడు.

అభిమన్యుని గదాదండానికి మనయోధుని రథాశ్వాలు బలి అయాయి, పార్శ్వరక్షకులూ ఆహుతి అయారు.

ఆ సమయంలో డెబ్బైయేడుగురు గాంధార దేశీయులూ, ఏడుగురు కేకయదేశ రథికులూ వానికి ఎర అయారు.

దుశ్శాసన నందనుడు గదా ధరుడై ఎదురువచ్చాడు. వా రుభయులూ సాగించిన పోరులో యిద్దరూ చైతన్యశూన్యులయి నేలకూలారు మహారాజా!

సరోవరాన్ని కల్లోలపరిచే మత్తేభాన్ని చుట్టుముట్టి బోయవాండ్రు హింసించి హత మార్చినట్లు నీ పక్షంలోని యోధులందరూ ఆ వీరుని యమ పురికి పంపారు. మహారణ్యాన్ని బూడిద చేసి చల్లారిన దావాగ్నిలా, మహావృక్షాలను సమూలంగా పెల్లగించి శాంతించిన ప్రచండవాయువులా, సర్వ ప్రపంచాన్నీ సంతప్తం చేసి పడమటి కొండ చేరిన భాస్కరునిలా, వున్నాడు నేలకూలిన అభిమన్యుడు. ఆ కన్నులలో క్రోధారుణ రోచులు చల్లారలేదు; ముఖంలో తేజస్సు వాడలేదు. ఉల్లోల కల్లోలిత సరోవరంలా రణ రంగం రమణీయ భయానకంగా వుంది. పదివేలమంది రథికులూ, బృహద్బలునివంటి మహా యోధుడూ ఆ బాల వీరుని విహారంలో నేలకూలారు. అంతమందిని హతమార్చి నేలకూలాడు అభిమన్యుడు.

ఆ వార్త విన్న ధర్మనందనుని కంట నీరు తిరిగింది. వారి సేన హాహారవాలు చేయగా మనవారు హర్ష ధ్వానాలు చేశారు. సూర్యుడు అస్త గిరికి చేరాడు. యుద్ధ విరామం ప్రకటించారు.

మహారాజా! ఆ సాయంవేళ రణరంగంలో కుక్కలూ, నక్కలూ, తోడేళ్ళూ యథే చ్ఛగా రక్త పానం చేస్తూ చెలగాటా లాడుతున్నాయి. భూత, ప్రేత, పిశాచ గణాలు వికటాట్ట హాసంతో తాండవం ఆరంభించాయి. శవాల చర్మాలు చీల్చి వసా రక్తాలను జుర్రు కుంటున్నాయి. మజ్జా, మాంసాలను ఆరగిస్తూ, కొవ్వు కొరికి తింటూ పాటలు పాడుతున్నాయి. నాటి యుద్ధంలో రక్తప్రవాహం శవాలనే కాదు, రథాలనూ ఏనుగులనూ కూడా లాక్కుపోతున్నది, అంటూ సంజయుడు భయంకరంగా వున్న ఆ రణ స్థలిని మాటలతో ప్రత్యక్షం చేసి –

ప్రభూ! ఆ రణరంగం నుండి తిరిగివెళ్ళే ధర్మరాజు ముఖం మ్లానంగా వుంది. అందరి ముఖాలలో దైన్యం బాష్ప ధార లేని కన్ను కనబడలేదు. కొంతసేపు ధర్మరాజు విల విల విలపించి, అభిమన్యుని సాహస పరాక్రమ ప్రశంస చేసి, మళ్ళీ శోకావిల చిత్తుడయాడు.

అప్పుడు వ్యాసమహర్షి వచ్చి మరణించిన వారికోసం విచారించడం వివేకుల పని కాదని చెపుతూ అకంపన మహారాజు వృత్తాంతమూ, మృత్యువు పుట్టుక వివరించి షోడశ మహారాజుల చరిత్రలూ స్థూలంగా బోధించి –

నాయనా! అటువంటి మహామహులే మృత్యువుకు వశంకాక తప్ప లేదు. ఇక మన మెంత! మరొక్క రహస్యం వుంది. మనం జీవించి వున్న వారి కోసం శోకించాలే తప్ప మనతో అన్నిబంధాలూ తెంచుకు పోయిన వారి కోసం ఏడవడం దేనికి! జ్ఞాని శోకాన్ని దరి జేరనివ్వకూడదు. "జాతస్య మరణం ధ్రువమ్" అని ఎరగవా, నాయినా! అని పరి పరి విధాల ఓదార్చి వెళ్ళాడు.

## సైంధవవధ

పాండవ శిబిరాలలో నిశ్శబ్దం తాండవిస్తున్నది. ఎవరూ ఎవరితోనూ ఏమీ మాట్లాడ లేక పోతున్నారు. అందరూ తలలు వాల్చుకుని శిబిర ద్వారాలలో కూలబడ్డారు.

ఆ సమయానికి తిరిగి వస్తూన్న సవ్యసాచి బావా! ఏమిటిది మన శిబిరాలలో చైత న్యం లేదు. ఎప్పుడూ ఎదురు వచ్చే అభిమన్యుడు రాడు. మంగళ వాద్యాలు వినబడవు. స్వాగత సూక్తాలు వినరావడం లేదు. నా మనస్సు అమంగళాన్ని శంకిస్తున్నది. ఏదో జరగ కూడని పని జరిగి పోయింది, రథం త్వరగా పోనియ్యి, అన్నాడు.

రథం ఆగింది; శిబిర సమీపానికి చేరి, మహావీరులందరూ వున్న చోటికి వెళ్ళి, కలయజూశాడు.

కనిపించ లేదు అభిమన్యుడు. ఎవరి ముఖం లోనూ ఉత్సాహం లేదు. ఎవరూ పెదవి విప్పడం లేదు; కన్నెత్తలేక పోతున్నారు గాండీవి వైపు.

అప్పుడు ధర్మరాజు విచార వదనంతో జరిగిన కథ అంతాచెప్పాడు. గాండీవి గుండె బేల పడింది. ఇంత సేపు ఏడిచి, అభిమన్యుని మృతికి కారణం సైంధవుడు, రేపు సూర్యాస్తమ యం కాకుండా సైంధవుడు నేల కూలకపోతే ప్రాణ త్యాగం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

ఈ ప్రతిన కౌరవ స్కంధావారం చేరడంతో సైంధవుడు గజ గజ లాడుతూ, రణ రంగం విడిచి ఎక్కడికయినా పోయి ప్రాణ రక్షణ చేసుకుంటా నన్నాడు. కాని ఒక్క సైంధ వుడి ప్రాణరక్షణ తమకు పెద్దపని కాదన్నారు, మహారథికులు.

రాత్రి బాగా పొద్దు పోయింది. మరునాటి వ్యూహ నిర్మాణం గురించి బాగా యోచ నలు చేశారు. అర్ధరాత్రి దాటింది. వాసుదేవుడు తన సారథి దారుకుని పిలిచి: "రేపు మన రథం సిద్ధంగా వుంచు, శైబ్య, సుగ్రీవ మేఘపుష్ప, వలాహకాలను పూన్చి, గరుడ ధ్వజం సంఘటించి, గదా, ఖడ్గ చక్ర శార్ఙ్గాలు కూడా వుంచి రణరంగానికి దగ్గరలో వుండు, పాంచ జన్య ధ్వని వినగానే రథంతో వ్యూహమధ్యంలోకి రావాలి. అప్రమత్తంగా వుండు. రేపు ఈ యోధులందరూ మన ప్రతాపం చూస్తారు – అన్నాడు.

ఆ రాత్రి నిద్రలో అర్జునుడు కలగన్నాడు. ఆ కలలో కైలాసం వెళ్ళి పరమ శివుని వద్ద పాశుపతమంత్రం ప్రయోగోపసంహార క్రమంతో గ్రహించి తిరిగి వచ్చాడు కృష్ణునితో.

కల కరిగింది. కృష్ణునితో చెప్పగా ఆ పురుషోత్తముడు సంతోషించాడు, శుభసూచ కంగా భావించి.

తూర్పు దిక్కులో ఉషో రాగాలు నడయాడు తున్నాయి. దేవకీ నందనుడు తన రథాన్ని సిద్ధం చేశాడు. అది బాల భానునివలె వెలుగు తున్నది. అర్జునుడు విప్రశ్రేష్ఠుల ఆశీర్వాదాలు పొంది, రథానికి ప్రదక్షిణం చేసి, అధిరోహించాడు. కృష్ణుడు, సాత్యకీ ముందు కూర్చున్నారు. అప్పుడు అర్జునుడు :

సాత్యకీ! ఈనాడు మనం సైంధవ వధ సాగించబోతున్నాం. అయితే ఆ మహా యత్నంలో ఏ మాత్రం ఏమరుపాటున వున్నా, వారు మా అన్నగారిని బంధించ గలరు. కనుక నువ్వు ఆయనకు రక్షగా వుండాలి అని హెచ్చరించాడు.

అక్కడ ఆచార్య ద్రోణుడు శకట వ్యూహం పన్ని గర్భ వ్యూహంగా పద్మ వ్యూహం పన్ని, సేనా ముఖంలో సూచీ వ్యూహం నిర్మించాడు. ఈ వ్యూహమూల స్థానంలో సైంధవుని ఉంచారు. దుశ్శాసన, వికర్ణులిద్దరూ జయద్రథుని రక్షణకు నిలిచారు. శకట వ్యూహ ముఖంలో ఆచార్యులవారు ధనుస్సు పట్టి వున్నారు.

అటునుంచి అర్జునుని అనుసరించి ధృష్టద్యుమ్నుడూ, ఆ వెనుక నకులుని కొడుకు శతానీకుడూ సాగివచ్చారు. శంఖ భేరీ నాదాలు మిన్ను ముట్టాయి.

అర్జునుడు : బావా! దుర్మర్షణుడు చాలా ఉత్సాహంతో వస్తున్నాడు. వాడు ఈ ధనుస్సుకు తొలి కబళం; రథం వాడి కెదురు నడుపు అనడమూ వాసుదేవుడు, గుర్రాలను అటు కదిలించడమూ, ఆ సవ్యసాచి బాణఘాతాలకు వాని గుర్రాలు నేలకూలి, సారథి మన్ను కరవడమూ రెప్పపాటులో జరిగాయి. దుర్మర్షణుడు పలాయనం సాగించగా దుశ్శాసనుడు తీవ్ర రోషంతో వచ్చాడు.

అప్పుడు సాగిన యుద్ధంలో గాండీవి విడిచే బాణపు దెబ్బలకు కురువీరుల తలలు ముగ్గిన తాటిపళ్ళవలె నేల రాలు తున్నాయి. దుశ్శాసనుడు ఎదురు నిలవలేక పిక్కబలం చూపాడు. ఇక కాలయాపన యిష్టం లేక రథం జయద్రథుని వైపు నడపమన్నాడు.

వ్యూహ ముఖ ద్వారంలో వున్న ఆచార్యునికి నమస్కరించి : గురుదేవా! మీరు అశ్వత్థామను చూసినట్లే నన్నూ ఆదరించారు. ఇప్పుడు సైంధవ ద్రోహి వధకు అనుజ్ఞ కోరు తున్నాను – అని నమస్కారం చేశాడు.

ఆచార్యుడు చిఱునవ్వుతో అనుమతి సూచకంగా బాణాలు విడిచాడు. కొంతసేపు ద్రోణునితో పోరు నడిపి వ్యూహ మధ్యం ప్రవేశించే వూహతో ఆచార్యునికి ప్రదక్షిణించి ముందుకు నడిపాడు రథాన్ని.

సరోవరంలో మత్తేభంలా సైన్య మధ్యంలో సవ్యసాచి విహరిస్తూంటే ఆచార్యుడు కొంతసేపు నిరోధించి వ్యూహ ముఖద్వారం విడవడం యిష్టంలేక అక్కడే ఆగాడు.

ఆ సమయంలో ఎదురు వచ్చిన వరుణ నందనుడు శ్రుతాయుధుడు కొండలా కూలిపోయాడు. కాంభోజపతి సుదక్షిణుడు మహావృక్షంలా పడ్డాడు. అనంతరం శ్రుతాయువు అయుతాయువు ఎదురువచ్చి తమ వెంట వున్న అయిదు వందల మంది రథికులతో నేల కరుచుకున్నారు.

లేడిపిల్లల మందలో సింహంలావున్న అర్జునుని చూపుతూ దుర్యోధనుడు: ఆచార్యా! మిమ్మల్ని నమ్ముకుని జయద్రథుడు నిలబడ్డాడు. మీరు పాండవ పక్షపాతంతో వున్నారు. ఊఁ, తేనే పూసిన కత్తి వ్యవహారం — అని నాలుక కరుచుకొని:

ఆచార్యా! బాధలో నోరు జారింది. మీరు పూనుకుని ఈ విపత్తు నుండి రక్షించాలి. అని అర్థించాడు.

నాయనా! నువ్వూ, అశ్వత్థామా నాకు సమానమే! కొడుకు మాటలకు తండ్రికి కోపం రాదు. ఇక నేను ముఖ ద్వారం విడిచానంటే పాండవ బలం కట్ట తెగిన నదిలా మన వారిని ముంచుతుంది. పయిగా ధర్మరాజును సజీవంగా బంధిస్తానని ప్రతిజ్ఞ చేశాను గదా! అదీగాక వార్ధక్యంలో వున్న నా కంటె అర్జునుని ఎదిరించడానికి నువ్వే సమర్థుడివి వెళ్ళు; మహాయోధులను వెంటబెట్టుకుని వాణ్ణి నిలబెట్టు. ఇదిగో ఈ కవచం తొడుగుకో. ఇది వుండగా ఎవడిబాణమూ నీ శరీరానికి సోకదు. ఈ కవచాన్ని బ్రహ్మ దేవేంద్రుడికి ఇచ్చాడు అది దేవపతి అంగీరసుడికి, ఆయన బృహస్పతికీ ఈయన అగ్నివేశుడికీ యిచ్చారు. ఆ మహర్షి అనుగ్రహించి నాకు దయజేశాడు, అని మంత్రకవచం ధరింపజేశాడు.

అంతలో ధృష్టద్యుమ్నుడు ద్రోణునిమీదికి వచ్చాడు. వివింశతి, వికర్ణ, చిత్రసేనులు భీముని ఎదిరించగా బాహ్లికుడు ఉపపాండవులతో తలపడ్డారు. దుశ్శాసనుని సాత్యకీ శకునిని నకుల, సహదేవులూ, అలంబుసుని ఘటోత్కచుడూ....అలా ఎవరికి వారు తమకు తగ్గవారితో పోరు నడుపుతున్నారు.

సేనా ముఖంలో ద్రోణునితో తలపడ్డ ధృష్టద్యుమ్నుని సాత్యకి రక్షించి తప్పించుకొచ్చాడు. అది ఆచార్యులకు మరింత క్రోధకారణం కాగా ఆయన సాత్యకిని తూట్లు తూట్లు కొట్టాడు. చూసి చూసి సాత్యకి ఆయన ధనుస్సును రెండు ముక్కలు చేశాడు; మరొక ధనుస్సు; అదీ ముక్కలయింది. అదొక వేడుక అయింది సాత్యకికి.

ఆచార్యునికి సాత్యకి హస్తలాఘవం ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ కలిగించింది; ఆయన ఆగ్నేయం సంధించగా ఈయన వారుణాస్త్రం ప్రయోగించాడు. ఆ దివ్యాస్త్రాలు రెండూ కొంతసేపు గగన భాగంలో క్రీడ నడిపి శాంతించాయి.

అప్పటికి ధర్మజ, భీమ, నకుల సహదేవులతో ధృష్టద్యుమ్నుడు వచ్చి ఆచార్యునితో పోరు నడుపుతున్నాడు.

అక్కడ అర్జునుడు సైంధవుని కోసం సాగుతూఉండగా, అవంతీ రాకుమారులు విందానువిందులు అడ్డుకున్నారు. వారి రథాశ్వాలనూ సారథినీ నేలకూల్చి విందుని శిరస్సు భూమికి విందుచేశాడు. అది విచారం కంటె క్రోధాన్ని రెట్టించగా అనువిందుడు పాద చారియై కృష్ణుని నుదురు బొప్పి కట్టించాడు. అర్జునుడు కుపితుడై రెండు క్షణాలలో వానిని కూడా విందునికి తోడు పంపాడు.

అనంతరం అనేకులు యోధులు అర్జునుని ఎదుర్కొని సింహనాదాలు చేసి, బాణ వర్షం కురిపించారు. ఆ బాణఘాతాలకు గుర్రాలు అలసి పోయాయి. అది చూసి అర్జునుడు మాధవా! ఒక్కమాటు గుర్రాలకు కళ్ళాలు వదలి వాటి వెన్ను నిమురు అనగా, రథికవరా! ఏమిటి చెపుతున్నావు. ఈ తుముల సంగ్రామంలో రథికుడు రథం మీద వుండగా గుర్రాలకు ఆశ్వాసన! అన్నాడు నవ్వుతూ.

తక్షణం రథం దిగి, గాండీవాన్ని చక్రాకృతిలో వుంచి పోరు నడుపుతుంటే కురు యోధులు యిదే అదనని చుట్టుముట్టి సంకుల సమరం సాగించారు. అందరినీ ఆ యోధుడు అల్లంత దూరంలో నిల బెట్టి నేల కూలుస్తున్నాడు.

కొంతసేపటికి కృష్ణుడు గుర్రాల శరీరంలో నాటుకున్న ఆయుధాలన్నీ తీసి పార వైచి, బావా! ఇప్పుడింక వీటికి కడుపునిండా మంచినీరు పట్టి ఒళ్ళు కడగాలి అన్నాడు.

అర్జునుడు ఒక్క బాణం నేలకు కొట్టడంతో ఆ దాటికి భూమి బీటలువారి చిన్న సరో వరం ఏర్పడింది. ఆ చెరువులో గుర్రాలను కడిగి నీరుపట్టి రథానికి సజ్జితం చేసి యింత పచ్చిక తినిపించి, అర్జునుని దగ్గర నిలిపాడు. ఆ యోధుడు చిరునవ్వుతో రథం ఎక్కాడు. రథం ముందుకు సాగుతోంది.

కురుసేన తల్లడిల్లి యిక జయద్రథ రక్షణ తమతరం కాదనుకుంటూండగా ద్రోణా చార్యులు అనుగ్రహించిన రక్షాకవచధారియైన సుయోధనుడు సవ్యసాచికి ఎదురువచ్చాడు.

చిరునవ్వు వెన్నెలజల్లుతో మాధవుడు : కిరీటీ! మానధనుడు కనక ఎదురు వస్తున్నాడు. ఈ దుర్బుద్ధికి తగిన శాస్తి చెయ్యాలి. జూదం పేరిట జరిపిన అన్యాయాలూ, మీ పట్ట మహిషికి చేసిన అవమానాలూ గుర్తుంచుకుని పోరు సాగించు - అన్నాడు.

అర్జునుడు బాణవర్షం కురిపించినా సుయోధనుడు చలించక పోవడంతో వాసుదేవుడు తెల్లబోయి చూడగా,

బావా! ఆచార్యులవారు ఈ దుష్టుడికి మంత్రకవచం అనుగ్రహించారు. అయితే ఏ కవచం ధరించినా భేదించే అస్త్రం అంగిరసుడు అమరేంద్రుని కిచ్చాడు. అది ఆయన నాకు దయచేశాడు. దానితో వీని గర్వం అణగారుస్తా అంటూ ప్రయోగించాడు. అదిచూసి అశ్వత్థామ సర్వాస్త్రఘాతి అభిమంత్రించి విడిచాడు. అది అర్జుని ప్రయత్నాన్ని విఫలం చేసింది.

అర్జునుడు పంటితో పెదవి కొరుకుతూ బాణవర్షంతో వాని గుర్రాలనూ రథాన్నీ ముక్కలు చేయగా సుయోధనుడు మరొక కవచం తొడిగి ధనుస్సునూ చేపట్టాడు.

ఆ సమయంలో సవ్యసాచి గ్రీష్మవేళ మహారణ్యంలో దావానలంలా వున్నాడు.

కృప, కర్ణ, అశ్వత్థామ, వృషసేన, శల, శల్య, భూరిశ్రవ, జయద్రథులు ఎవ మండుగురూ అర్జునునికి ఎదురువచ్చారు. ఇక్కడ యిలా వుండగా సేనాముఖంలో ధర్మరాజు ద్రోణాచార్యులతో పోరాడుతున్నాడు. ఆచార్యుడు ధర్మజుని ధనుస్సు ముక్కలు చేశాడు మరొక ధనుస్సు అందుకున్నాడు పాండవాగ్రజుడు. ఆచార్యుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించగా అదే అస్త్రంతో దానిని ఉపశమింపజేశాడు ధర్మరాజు.

తీవ్రక్రోధంతో ద్రోణుడు శరవర్షం కురిపించి ధనుస్సు విరుగకొట్టి గుర్రాలు నేల కూల్చి కేతనం పడగొట్టగా ధర్మరాజు విహ్వలుడై చేతులెత్తాడు. ఆచార్యునికి ధర్మరాజును హింసించడం యిష్టంలేక మిగిలిన బలగం వయిపు తిరిగాడు. ఆ సమయంలో కౌంతేయుడు తన సోదరుని రథం ఎక్కి దూరంగా వెళ్ళాడు.

అలంబుసుని ఆఘాతానికి భీముడు మూర్ఛిల్లి తేరుకుంటూనే కాటుక కొండలా వున్న ఆ అసురుని దేహం విరిసిన పూలతో నిండిన మోదుగచెట్టులా భాసించేటట్లు హింసించాడు. వాడు చలించక మాయా యుద్ధం ఆరంభించాడు.

ఈ వంక ఘటోత్కచుడు ద్రోణుని మీదికి ఎస్తూంటే వాడికి అలంబుసుడు ఎదురు వచ్చాడు. అలంబుసుడు విడిచిన చక్రాన్ని గదతో పిండి చేశాడు ఘటోత్కచుడు.

అంతలో ఆ రాక్షస వీరునికి ఆవేశం హెచ్చింది శత్రువీరు లందరినీ చీకాకు పరుస్తూ పరాక్రమిస్తుంటే ఉపపాండవులూ, నకుల సహదేవులూ నలిగిపోతున్నారు.

చూశాడు ఘటోత్కచుడు; ఒక్క ఆయుధంతో అలంబసుని రథసారథిని నేల కూల్చాడు. అలంబుసుడు భూమికి దిగి బాణవర్షం కురిపించాడు. ఘటోత్కచుడు గదా దండంతో ఎదురు వెళ్ళాడు. ఖడ్గధారియై వాడు ఆకాశానికి ఎగిరాడు; ఖడ్గంతోనే భీమనందనుడు లేచాడు.

సుడిగాలిలా తిరుగుతూ కొంతసేపు ప్రదక్షిణంచేసే మెరుపుల్లా కొంతసేపు రణక్రీడ సాగించి నేలకుదిగి ఆకలిగొన్న బెబ్బులులవలె కలియబడ్డారు. రక్తధారలు స్రవిస్తున్నాయి. హిడింబకొడుకు మహోదగ్రుడై తన మోచేతులతో మోకాళ్ళతో వాని అంగసంధులు విరగ బొడిచి వెన్నుపూసలు సడలించి వదిలి పెట్టాడు. వాడు గిల గిల కొట్టుకుని కళ్ళు తేల వేశాడు.

ఘటోత్కచుడు సింహనాదం చేశాడు. పాండవసేన శంఖధ్వానం చేసింది. ధర్మరాజు తన బిడ్డను గాఢంగా కౌగలించుకుని ఆశీర్వదించాడు, అని సంజయుడు చెపుతూంటే ధృతరాష్ట్రుడు :

సంజయా! ద్రోణులు, కృతవర్మ యింకా ఎందరో మన యోధులున్నారు కదా! వారంతా .... అనగా సంజయుడు : మహారాజా! అక్కడ సాత్యకి వీరవిహారం చేస్తున్నాడు. ఆచార్యుని ఆజ్ఞానుసారం కృతవర్మ అసంఖ్యాకసేనతో సాత్యకిని నిలబెడుతున్నాడు. అప్పుడు శిఖండి వాని విల్లు విరగగొట్టాడు. అదే సమయంలో కత్తి విసిరి శిఖండి విల్లు ఖండించాడు కృతవర్మ. ఇద్దరూ మళ్ళీ ధనుస్సులు అందుకున్నారు. అంతలో భోజు డెదురురాగా సాత్యకి వానితో తలపడ్డాడు. అటునుంచి అశ్వత్థామ వచ్చాడు. అందరినీ చీకాకుపరిచి, అర్జునుడున్న దిశగా రథం సాగించమన్నాడు. దారిలో జలసంధుడు నిలువరించగా వాని శిరస్సు ముగ్గిన పండులా నేలకు రాలింది, సాత్యకి బాణఘాతంతో.

కృతవర్మ మళ్ళీ అడ్డువచ్చాడు కాని, ద్రోణాచార్యుల వారు స్వయంగా సాత్యకిని ఎదుర్కొన రాగా ఆయన వెంట నీ కొడుకులు దుస్సహ, వికర్ణ, దుర్ముఖ, దుశ్శాసనాదులు తోడు వచ్చారు. వీరిందరికీ అండగా దుర్యోధనుడు రావడం చూసి, ఆచార్యుడు తిరిగి సేనాముఖానికి వెళ్ళాడు. అప్పుడు సాగిన యుద్ధంలో దుర్యోధనుని రథధ్వజం, గుర్రాలూ నేలకూలాయి. సారథికికూడా శరీరం తూట్లు పడింది. దగ్గరలో వున్న చిత్రసేనుడి రథం ఎక్కి విజృంభించాడు. అప్పటికి మళ్ళీ అక్కడకు చేరిన కృతవర్మ సాత్యకి బాణఘాతంతో మూర్ఛబోయాడు.

సాత్యకి సవ్యసాచి కోసం సాగుతూంటే ఆచార్యుడు మళ్ళీ అడ్డుపడి విడిచిన మూడు బాణాలు వాని నుదుట నాటుకున్నాయి. ఆ వీరుడు కూడా యథోచితంగా గురువును వేధిస్తున్నాడు. అంతలో సాత్యకి విల్లు విరిగింది; సారథి మూర్ఛపోయాడు. అయినా తనే సారథ్యం చేసుకుంటూ నడుపుతున్నాడు. కొంత సేపటికి ద్రోణుని రథసారథి వాలిపోగా, గుర్రాలు రణ విముఖమయాయి. సాత్యకి మళ్ళీ అర్జునుని వయిపు సాగుతున్నాడు.

దారిలో సుదర్శనుడు అడ్డుపడి నేలకూలాడు. కుపితులై దుర్యోధన, దుశ్శాసన, చిత్రసేన, వివింశతి, శకుని ప్రముఖులు తరుముతూ రాగా, వారిని చిరునవ్వుతో రణక్రీడకు ఆహ్వానించాడు.

ఆ సమయంలో సుయోధనుడు, శకునితోడుతో సాత్యకిని చికాకుపరుస్తూ, వాని సారథినీ, గుర్రాలనూ హింసింపగా, ఆ యోధుడు మనవాని సారథిని నేలకూల్చి, శకుని ధనుస్సు గాలిలోకి ఎగురగొట్టాడు.

దుశ్శాసనుడు ఎదురురాగా బాణ వర్షంతో ఊపిరి సలపకుండా ఆడించాడు సాత్యకి. ఉక్కిరిబిక్కిరయి దుశ్శాసనుడు ఒక్కవూపులో ద్రోణాచార్యుల చాటుకురాగా, ఆయన: నాయనా, కుశలమా! ఏమిటిలా వచ్చావు? ఓహో! సాత్యకి తీసిన దెబ్బకే యిలా అయితే యింక భీమార్జునులు ఎదురుపడితే ఏమవుతావు? నాయనా! నిండుసభలో ఆడుదానికి బట్టలు విప్పడమూ, అహింసామూర్తులను అవమానించడమూ అనుకున్నావా యుద్ధమంటే!

సంగ్రామం అంటే అటుకులూ, బెల్లం కలుపుకు తినడం కాదోయీ. వెళ్ళు, వెళ్ళు, మీకు సాయం వచ్చిన రాజుల కంఠ నాళాలు కోస్తున్నాడు సాత్యకి. వారిని రక్షించు, అని పరిహసించాడు.

వినీ విననట్లు తలవంచుకు రథం నడిపించేశాడు, దుశ్శాసనుడు.

ద్రోణుడు విజృంభించి ధృష్టద్యుమ్నుని సోదరుడయిన వీరకేతుని నిలువరించి, నేల కూల్చగా వాని సోదరులందరూ ఆచార్యుని చుట్టుముట్టారు. ధృష్టద్యుమ్నుడు నిశిత శర వర్షం కురిపించగా, ఆచార్యుడు మూర్ఛిల్లాడు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు రథం దూకి, ఆచార్యుని శిరస్సు నరికే సంకల్పంతో కత్తి దూశాడు. అప్పటికే ఆయన తేరుకుని వాడి శరాలతో వానిని హింసించాడు. ఆ క్షణంలో ఆచార్యుడి పరాక్రమం పాండవసేనను అచేతనం చేసింది.

ఇక్కడ దుశ్శాసనుడు సాత్యకితో తలపడ్డాడు. అతనికి తోడుగా త్రిగర్తసేనలు వచ్చాయి. ముందుగా సేనలను తరిమి కొట్టి, దుశ్శాసనుని ధనుస్సు విరుగకొట్టి సారథినీ

గుర్రాలనూ మట్టి కరిపించి, వాసిని కడతేర్చడానికి కత్తి దూశాడు. కాని, భీముడి ప్రతిజ్ఞ స్మరణకు వచ్చి ఆగాడు.

ఇక్కడ ద్రోణాచార్యుల విజృంభణం చూసి ద్రుపదుడు : ఓ మహాయోధులారా! ఈ విప్రుడు మన క్షత్రియయోధులందరినీ ఊచ కోత కోస్తున్నాడు చూశారా! ఆపండి ఈ విజృంభణం అని గర్జించాడు.

ధర్మరాజు భీముని పిలిచి : నాయనా! సవ్యసాచికి సాత్యకి తోడువెళ్ళాడు. కాని, నా గుండె కేదో భయంగా వుంది. నువ్వు అక్కడికి వెళ్ళి సింహనాదం చేస్తే నాకు తృప్తి అన్నాడు.

భీముడు ధృష్టద్యుమ్నుని చేరి, మా అగ్రజుల రక్షణభారం నీ మీద ఉంచి వెడుతున్నానని వ్యూహమధ్యంలోకి రథం సాగించమన్నాడు.

సారథి విశోకుడు ఉత్సాహంతో నడుపుతుండగా ముఖద్వారంలో ద్రోణుడు పిలిచి: భీమసేనా! నీ తమ్ముడు సవ్యసాచి నా అనుమతితో వెళ్ళాడు, అంటూండగా భీముడు కన్ను లెర్రజేసి పాండవవీరులు దేవసేనను కూడా లక్ష్యం చెయ్యరు. మీరు గురువులు కనుక మరియాద యిస్తున్నాం. అయినా శత్రుసేనలో వున్న మీకు తలవంచడమా అంటూ గదా దండం విసిరాడు. ద్రోణుడు రథం దిగేశాడు. ఆ గదాఘాతానికి ఆచార్యుని రథం, గుర్రాలతో, సారథితోసహా చూర్ణమయింది. ఆయన మరొకరథం ఎక్కి బాణవర్షం కురిపించాడు. కుంభవృష్టిని లక్ష్యపెట్టని మహావృషభంలా భీముడు వ్యూహ మధ్యంలోకి వెళ్ళే వూహతో తన రథం దిగి ఆచార్యుని రథం ఒకచేత్తో విసిరేలోగా ఆయన రథం దిగేశాడు. అంతలో భీముడు మళ్ళీ రథంఎక్కి వ్యూహమధ్యంలోకి వెళ్ళి అర్జునునీ, సాత్యకినీచూసి సింహనాదం చేశాడు.

ధృతరాష్ట్రుడు :

సంజయా! ఇక మనవారిని రక్షించే యోధుడే లేకపోయాడా! అని ప్రశ్నించగా, మహారాజా! భీమసేనుడికి ఎదురుగా కర్ణుడు నడిచి కొంతసేపు బాధించాడు. అంతలో భీముడు వాని విల్లు విరిచాడు. మరొక ధనుస్సుతో కర్ణుడు తన విద్యను ప్రదర్శించబోగా దానినీ వాని సారథినీ, గుర్రాలనూ నేలకూల్చాడు కౌంతేయుడు, అని సమర వృత్తాంతాన్ని వినిపించసాగాడు సంజయుడు.

చేసేదిలేక కర్ణుడు వృషసేనుని రథం ఎక్కి వెనుదిరిగాడు. దాన్ని చూసిన దుర్యోధనుడు ఆచార్యుని సమీపించి : చూడండి, అటు అర్జునుడు, ఇటు సాత్యకి, ఈవంక భీమసేనుడు మహాసాగరంలో తిమింగలాలవలె తిరుగుతున్నారు మన సేనామధ్యంలో.

మీరు అర్జునుని వదిలేశారూ అంటే అర్థం వుంది. కాని సాత్యకి కూడా ధనురాచార్యులను ఓడించాడంటే అంతకంటె అవమానం వున్నదా? అనడంతో ఆయిన - సుయోధనా! సైంధవుడు పూర్ణంగా సాగుతున్న ఈజూదంలో నువ్వూ అర్జునుడూ మీశక్తిసామర్థ్యాలు ప్రదర్శించాలి. ఇదివరలో శకుని ఆలోచన మీకు విజయం తెచ్చిపెట్టింది. కాని మోసంతో వచ్చిన లక్ష్మి అది. ఇప్పుడు అటువంటి దుర్మంత్రానికి అవకాశం లేదు. వెళ్ళి జయద్రథ రక్షణలో వుండు. నేను ముఖద్వారం విడిచానో మూలానికే ముప్పు - అన్నాడు.

దుర్యోధనుడు రథాన్ని అర్జున ముఖంగా నడిపి విల్లు ఎక్కుపెట్టాడు. ఆ సమయంలో సవ్యసాచి బాణ ఘాతాలకు సుయోధనుని సూతుడూ, గుర్రాలూ నేలకూలాయి. దానితో మనవాడు గదాదండం ధరించి శల్యుని రథం ఎక్కాడు. అక్కడ కర్ణుని విరథుని చేసిన భీముడు గాండీవికి తోడుకావడానికి వెడుతూండగా కర్ణుడు చూసి ఒక్కకేక వేశాడు. అది విని భీముడు మరొక్కమారు కర్ణునికి తన ప్రతాపం చూపాడు. మళ్ళీ కర్ణుడు మరొక రథం ఎక్కక తప్పలేదు.

అనంతరం ఆ ఉభయులూ ఆకలిగొన్న పెద్దపులులవలె పోరుతున్నారు. అప్పుడు కూడా పాండవులదే పైచేయి — అని సంజయుడు చెపుతూంటే కురురాజు:

సంజయా! మనవారి దురదృష్టం కాకపోతే దేవకీనందనుని మాట పెడచెవిని పెడతారా! ఈ రాధేయుని ప్రతాపమూ, మంత్రాంగమూ నమ్మికదా మనవారు ఇంతకు సాహసించారు, అని అనంతర సంగ్రామ విశేషాలు ఏవిటీ అన్నాడు. అంత సంజయుడు, తిరిగి సమరగాథ కొనసాగించాడు.

ప్రభూ! అప్పుడు మన రాధేయుని విల్లువిరిగి, గుర్రాలు ఒరిగి, శరీరమంతా రక్తధారలు స్రవిస్తున్నాయి. చూశాడు సుయోధనుడు, సోదరుడయిన దుర్జయుని పంపాడు. క్షణాల వ్యవధిలో వీని సారధీ, రథమూ చూర్ణమయాయి. కర్ణుడు చూస్తున్నాడు. చూస్తూండగానే దుర్జయుని శిరస్సు బూడిదలో దొర్లుతున్నది. రాధేయుడు ఆవేశంతో యుద్ధం ఆరంభించాడు. వీనికి తోడుగా నీ కొడుకు దుర్ముఖుడు వచ్చి మరికొద్ది క్షణాలలో కన్నుమూశాడు.

అదిచూసిన కోపంతో నీ కొడుకులు దుర్మర్షణ, దుర్మద, దుస్సహా, విజయ, విచిత్రులయిదుగురు ఒక్కుమ్మడి వచ్చి క్షణాల వ్యవధిలో వీరస్వర్గం చేరుకున్నారు. అనంతరం చిత్ర, విచిత్ర, చిత్రాక్ష, చారుచిత్రులూ అదే దారిని వెళ్ళారు. చిత్రధ్వజ, చిత్రాయుధ, చిత్రకర్ములకు కూడా అటే నడవక తప్పలేదు. అనంతరం మరొక ఏడుగురు మన్ను కరిచారు.

కర్ణునికి బాధ ఎక్కువయి మరింత ఆవేశంతో భీమునితో పోరుతూ, ఆ మహాబలుని ఆ ఘాతాలకు ఆగలేక రథపీఠం వెనుక దాగవలసి వచ్చింది. భీముడు ఉత్సాహంతో ఒక్క గర్జన చేశాడు. అది కర్ణుని అభిమానాన్ని రెచ్చగొట్టింది. ఆ వేడిలో విజృంభించి భీమసేనుని విరథునీ నిరాయుధునీ చేశాడు. అలసిన భీముని కర్ణుడు తన వింటికొనతో పొడుస్తూ:

వృకోదరా! పీకలనిండ మెక్కి హాయిగా పడి దొర్లవలసిన వాడికి యుద్ధం దేనికిరా! ఫో, సుఖంగా అడవుల కడ్డుపడి కందమూల ఫలాలు మెక్కుతూ బతుకు — అని పరిహాసం చేశాడు.

అర్జునుడు ఆవేశంతో కర్ణుని కెదురువచ్చి శర వర్షం కురిపిస్తూండగా అశ్వత్థామ కర్ణునికి తోడయి సవ్యసాచి ఆటోపానికి ఆనకట్ట వేశాడు.

దుశ్శాసనుడు త్రిగర్త వీరులు తోడురాగా సాత్యకిని ఎదుర్కొన్నాడు. అయిదువందల మంది రథికులు సాత్యకి బాణ ఘాతాలకు మన్ను కరిచారు. దుశ్శాసనుని గుర్రాలు విలవిల తన్నుకుపడ్డాయి.

శూరసేన, కళింగసేనలు ఎదురురాగా వారినీ చెల్లాచెదురు చేసి, అర్జున సమీపానికి రాగా వాసుదేవుడు అభినందించాడు.

అర్జునుడు, బావా! సాత్యకి ఇటు రావటంతో ద్రోణాచార్యులు మా అన్నగారిని బంధిస్తారనే భయం కలుగుతున్నది. అదిగో భూరిశ్రవసుడు విక్రమిస్తున్నాడు చూశావా! అంటూండగా, సాత్యకి ఆ మహాయోధునికి ఎదురు నడిచి నిలబెట్టాడు.

ఉభయులూ తీవ్ర పోరాటం సాగించి రథాలూ, గుర్రాలూ, సారథులూ ముక్కలు ముక్కలు కాగా నిశిత కరవాలంతో కొంతసేపు రణ క్రీడ సాగించి మల్ల యుద్ధానికి దిగారు. అదిచూసి కృష్ణుడు:

బావా! అలసివున్న సాత్యకిని భూరిశ్రవసుడు చిత్రహింస పెడుతున్నాడు. రథం అటు నడుపుతాను అన్నాడు. అప్పటికే భూరిశ్రవసుడు తన కరవాల మండిత భుజదండం పైకెత్తి సాత్యకి శిరసు ఖండించ బోతున్నాడు. ఆ చెయ్యి కదిలే సమయంలోనే అర్జునుని బాణం వచ్చి చేతిని గాలలోకి ఎగరకొట్టింది.

అయినా చలించకుండా భూరిశ్రవసుడు: అర్జునా! నీతో యుద్ధం చెయ్యడం లేదే నేను. ఇటువంటి నైచ్యానికి వాసుదేవుడు నిన్ను పురి కొలుపుతా డనుకోను, అంటూండగా సవ్యసాచి: మహాయోధుడా! అలసిన సాత్యకిమీద అవలీలగా కలియ బడడం నైచ్యంకాదేం? వయసు నిండని అభిమన్యుని అందరూ కలసి కడతేర్చడం నీచ లక్షణం కాదు పాపం!

ఇటువంటి అనుచితాలు సవాలక్ష చేసిన మీరు నీచనైచ్యాలను ప్రస్తావించడం హాస్యాస్పదం అంటూండగా భూరిశ్రవసుడు నేలకొరుగుతున్నాడు. మూర్ఛ తేరిన సాత్యకి క్రోధోన్మత్తుడై కరవాలం ఎత్తి భూరిశ్రవసుని మీదికి నడుస్తూంటే :

సాత్యకీ! వద్దు, వద్దు, ఆ మహావీరునిమీద కత్తి పెట్టకు అని భీమార్జున కృష్ణులూ, కృప, అశ్వత్థామ, కర్ణులూ అరుస్తున్నా వినకుండా సాత్యకి వాని శిరస్సు ఖండించాడు. మహారాజా! (ఇదంతా సోమదత్తుడికీ సాత్యకి తాతకీ ఒకనాడు జరిగిన సంగ్రామ పరిణామం, అది వేరే కథ)

అంతకు ముందుగానే వాసుదేవుడు పాంచజన్యం పూరించాడు. ఆ సంకేతం గ్రహించి దారుకుడు రథం తీసుకొచ్చాడు. కృష్ణుడు తన రథం మీద సాత్యకిని అధిరోహింప జేశాడు.

కర్ణుడు సాత్యకిని నిలబెట్టి సాగించిన సంగర క్రీడ ఉభయబలాలకూ ఆశ్చర్యానందాలు కలిగించింది.

కృష్ణుడు రథాన్ని సైంధవాభిముఖంగా నడుపుతున్నాడు. ఆ సమయానికి భీముడటువచ్చి, రాధేయుడు పలికిన పలుకులు వినిపించగా అర్జునుడు కర్ణా! ఎన్నిసార్లు నువ్వు పలాయనం పఠించలేదు. అయినా నిన్ను పరిహసించి ఒక్కమాట అనలేదే! మా భీముడు ఒక్కమారు లొంగినంతలో ఎందుకంత నోరు పాడుచేసుకున్నావు నిన్నటికి నిన్న అక్రమంగా నా కొడుకు ధనుస్సు విరిచావు. దానికి ప్రతీకారంగా నీ సమక్షంలో నీ కొడుకు వృషసేనుడికి శిరచ్ఛేదం జరుపబోతున్నాను గుర్తుంచుకో అని పోరు ప్రారంభించాడు.

సూర్యుడు అస్త్రాద్రికి చేరుతున్నాడు

సవ్యసాచి కర్ణుని నిరోధించి రథాన్ని సైంధవుని వైపు నడిపిస్తున్నాడు అదిచూసి దుర్యోధనుడు కర్ణా! కృప, శల్య, అశ్వత్థామలతో నేనూ దుశ్శాసనుడూ నీతో వస్తున్నాం. మనమందరం మరొక్క ఘడియ అర్జునుని ఆపగలిగితే వాడి ప్రతిజ్ఞ పొల్లుపోతుంది అదిగో భీముడూ, సాత్యకీ అర్జునునికి తోడు వెడుతున్నారు. రథం నడిపించు అన్నాడు.

ఎదురు వచ్చిన కర్ణునితో తలపడ్డాడు అర్జునుడు.

ఆ పోరాటం దేవగణాలకే ఆశ్చర్యం కలిగించింది.

కర్ణుని శరీరం తూట్లుపడింది; అయినా పోరు మానలేదు. చూశాడు అశ్వత్థామ. తక్షణం అర్జునుని కెదురువచ్చాడు. శల్య, కృప, వృషసేనులు కూడా అటే చేరారు. ఇందరూ సైంధవ రక్షణలో అప్రమత్తులై వున్నారు.

సూర్యుడు అస్తాద్రికి చేరుతున్నాడు.

అర్జునుడు ఆందోళనలో పడ్డాడు.

కృష్ణుడు మాయను వ్యాపింపజేశాడు.

సూర్యుడు అస్తమించినట్టే అనిపించి, కౌరవులు హర్షధ్వానాలు చేస్తున్నారు.

సైంధవుడు పశ్చిమాకాశంలోకి తల యెత్తి చూస్తున్నాడు. అంతే! పావురాన్ని డేగ తన్నినట్టు అర్జునుడు విడిచిన బాణం సైంధవుని తలను ఎగురగొట్టింది.

బావా! ఆ తలను క్రిందపడనివ్వకు. సింధురాజు వృద్ధక్షత్రుడు తపస్సుచేసి వీణ్ణి పొందినప్పుడు, వీడి తల సంగ్రామంలో తెగిపడుతుందని వినిపించింది అశరీరవాణి. అప్పుడు వృద్ధక్షత్రుడు, వీడి తల ఎవడి చేతుల్లోంచి కిందపడుతుందో, ఆ చేయి కలవాడి తల వెయ్యిముక్కలవాలి అన్నాడు.

ఇప్పుడా వృద్ధక్షత్రుడు శమంతపంచకక్షేత్రంలో వున్నాడు. పాశుపతం ప్రయోగించి యీ తల ఆయన తోడమీద పడగొట్టు అన్నాడు వాసుదేవుడు ఉత్తర క్షణంలో సైంధవుడి శిరస్సు వాని తొడమీద పడింది; అసహ్యంగా వృద్ధక్షత్రుడు ఆ శిరస్సును కిందికి తోయడం తడవుగా ఆయన శిరసు ముక్కచెక్కలయింది.

మళ్ళీ సూర్యబింబం ప్రత్యక్షమయింది. ఆ సంజ వెలుగులో సైంధవుడి కళేబరం నేలమీద పొర్లుతున్నది.

మహారాజా! మనవారందరూ హాహారవాలు చేస్తుంటే పాండవపక్షం హర్షధ్వానాలు చేసింది.

ఇక్కడ ఇలా జరుగుతూండగా పాండవవీరులు సేనాముఖంలో వున్న ద్రోణుని హింసిస్తున్నారు. అశ్వత్థామా, కృపాచార్యుడూ అర్జునుని శరవర్షంలో ముంచుతున్నారు.

సవ్యసాచి విడిచిన బాణఘాతానికి కృపాచార్యుడు మూర్ఛపోయాడు; అది అర్జునునికే బాధ కలిగించగా.

బావా! ఇప్పుడు మనం ధర్మజుని రక్షణకు వెళ్ళాలి — అని రథం అటు మరలించాడు దేవకీనందనుడు.

భీముడు, సాత్యకి, యుధామన్యువు, ఉత్తమౌజుడు వారివెంట వెళ్ళారు. ధర్మజుని సమీపానికి చేరుతుండగా వాసుదేవుడు పాంచజన్యం పూరించాడు.

ఆ ధ్వని వింటూనే సంతోషంతో ధర్మరాజు రథం దిగి తమ్ముని ఆలింగనం చేసుకుని

తమ్ముడూ! నీ మీద రక్తబిందువు పడకుండా సైంధవుని యమపురికి పంపివచ్చా వంటే నాకు చాలా ఆనందంగా వుంది. సర్వ జగన్నాయకుడయిన వాసుదేవుడు అండగా వున్నప్పుడు మనకు ఎదురెవరు? అని అభినందించాడు. దగ్గర వున్న ఉత్తమౌజ యుధా మన్యులను కూడా వెన్నుతట్టి ప్రశంసించాడు.

ఆ సమయంలో సుయోధనుడు, ద్రోణాచార్యుని సమీపించి:

ఆచార్యా! పదకొండక్షౌహిణులసైన్యం, మీరు కృపాచార్యులు .... వుండగా శిఖండి చేతులలో భీష్మపితామహులు వాలిపోయారు. ఈనాటి కీ నాడు మా బావ జయద్రథుడు.... జలసంధుడు, కాంభోజరాజు, సుదర్శనుడు ఇంకా నా తమ్ములు, మరెందరో యోధులు .... ఇందరు వీరులు నేల పాలయినారు ఇప్పుడింక నేను ఈ పాండవ, పాంచాల సేనలను కడ తేర్చి వారి ఋణం తీర్చుకోలేకపోతే, వారుపోయిన దారినే వెళ్ళక తప్పదు మీకు పరమ ప్రియశిష్యుడు కనక అర్జునని మీరు హింసించరు. కర్ణుడొక్కడే మాకు రక్షా కవచం .... అని చెప్పుతుండగా - ఆచార్యుడు:

సుయోధనా! ఎందుకీ సూటి పోటి మాటలు. భీష్మ పితామహులు నేల కూలినప్పుడే నాకు విజయావకాశం లేదని తెలుసు. అయినా అభిమానం విడవలేక అస్త్రధారినై నిల బడ్డాను.

మరొక్కమాట నాయనా! విద్వాంసుడయిన విదురుడు ఎంత మొత్తుకున్నా విన కుండా యింటికోడల్ని ద్రుపదరాజ పుత్రిని అలనాడు అంతగా అవమానించారే, ఆ పాప ఫలం కట్టి కుడప కుండాపోతుందా! ఆ తరువాయి ధర్మాత్ములను అడవులపాలు చేసి ఎన్ని హింసలు పెట్టారు!

ఇన్నీ చూచికూడా యుద్ధానికి మీ పక్షాన నిలిచిన నేను విప్ర వంశీయుడనేనా!

నువ్వున్నావు, నీకు కావలసిన ఆప్తులందరూ వున్నారు. అభేద్యమయిన వ్యూహం పన్ని వున్నాం. ఇందరున్నా మీరెవరూ ఒక్క సైంధవుని రక్షింపలేకపోయారే, ఇంక నేనెంత!

అయినా, యిప్పుడు చెపుతున్నాను. ఈనాడు పాంచలసేనను సర్వనాశనం చెయ్య కుండా కవచం విప్పను. ఇదే నా ప్రతిజ్ఞ! వెళ్ళు. నా చేతులలో పడకుండా తప్పించుకున్న పాంచాలు డెవడున్నా సరే వాణ్ణి కడతేర్చమని నా మాటగా మా అశ్వత్థామకు చెప్పు! అన్నాడు.

దుర్యోధనుడు రథాన్ని కర్ణుని దగ్గరకు నడిపి:

రాధేయా! ఆచార్యులు ఎంత నిర్లిప్తంగా మాట్లాడుతున్నారో చూశావా! అనగా,

రాకుమారా! ఆయన మాత్రం ఏం చెయ్యగలడు. అర్జునుడు విక్రమిస్తే ఆగ గల వారు అమరాసురులలో లేరు. అయినా మన ప్రయత్నం మనం చేద్దాం - అని సంగ్రామోన్ముఖులయ్యారు.

ఆవేదన ఒకవైపు, ఆవేశం మరొకవంక రెచ్చగొట్టగా దుర్యోధనుడు పరాక్రమం ప్రదర్శిస్తూంటే, ధర్మరాజు స్వయంగా వానిని ఎదుర్కొన్నాడు. అప్పుడు సుయోధనుని విల్లువిరిగి మూర్ఛపోయాడు. కౌరవ సేన తమ ప్రభువు వీర స్వర్గం అలంకరించాడని హాహా రవాలు చేశారు.

తక్షణం ద్రోణాచార్యులు వెళ్ళి ధర్మరాజును నిలబెట్టాడు. పోరు ఘోరమయింది. ఆ యుద్ధంలో భీముని చేతులలో దుర్మద, దుష్కర్ణులు మట్టి కరిచారు. అక్కడ సాత్యకితో సోమదత్తుడు పోరుతూ మూర్ఛపోగా, ఆ రథం రణరంగానికి దూరంగా సాగింది. ఆచార్యుడు సాత్యకి ముఖంగా వస్తూంటే ఘటోత్కచుడు ఆయనకు అడ్డురావటం చూసి, కర్ణుడూ దుర్యోధనుడూ వానిమీదికి వచ్చారు.

పొద్దు వాలుతోంది. సంధ్యాకాంతులు విజృంభించే వేళ ఘటోత్కచుని బలం మరింత పెరిగి నిరాఘాటంగా శత్రుసాగరాన్ని కల్లోలం చేస్తున్నాడు. అశ్వత్థామ ఒక్కడే అక్కడ నిలబడ గలిగాడు. ఆచార్య పుత్రునితో యుద్ధం నడిపే ఘటోత్కచునికి వానికొడుకు అంజనపర్వుడు తోడువచ్చి అశ్వత్థామ చేతులలో నేలకూలాడు.

అంతతో ఘటోత్కచుని ఆవేశం పెరిగింది. క్రోధ తామ్రాక్షుడయాడు. అశ్వత్థామ అపరిమితావేశంతో శర వర్షం కురిపించాడు. ఘటోత్కచుని రథం చూర్ణమయింది. ప్రక్కనే వున్న ధృష్టద్యుమ్నుని రథంమీదికి నడిచాడు. అశ్వత్థామ విడిచిన బాణ పరంపర ఘటోత్కచుని మూర్ఛితుని చేసింది. ధృష్టద్యుమ్నుడు రథం మరలించేశాడు.

అప్పుడు ధర్మరాజూ, భీముడూ, సాత్యకీ అశ్వత్థామను ఎదుర్కొన్నారు. అంతలో మూర్ఛదేరిన ఘటోత్కచుడు మరింత ఆవేశంతో వచ్చాడు.

సోమదత్తుడు సాత్యకి మీదికి రావడం చూసి భీముడు వానికి తోడు వెళ్ళాడు. అప్పుడు సోమదత్తుడు మూర్ఛపోగా, వానితండ్రి బాహ్లికుడు రాగా భీముడు ముద్గ రాయుధం విడువగా ఆ మహాయోధుడు కులపర్వతంలా కూలిపోయాడు.

విడిచి కృప, కృతవర్మ లున్నచోటికి వచ్చి, ఇక పాండవులూ, కృష్ణుడూ, సాత్యకి మిగిలారు అన్నాడు.

అతని రాక్షసావేశం చూసిన ఆ మహా యోధులు విషణ్ణ హృదయులై తలలు వంచుకున్నారు.

ఇప్పుడీ వార్త మన ప్రభువుకి నివేదించాలి, అని అశ్వత్థామ రథం కదలించాడు. వారు కూడా అనుసరించారు.

ఆఖరి శ్వాస తీసుకుంటున్న దుర్యోధనుడు అశ్వత్థామ చేసిన సాహస కార్యాన్ని విని ఆనందంతో కన్ను మూశాడు, మనం వీర స్వర్గంలోనే కలుసుకుందాం అంటూ.

ఆ యోధులు ముగ్గురూ సుయోధనుని శరీరాన్ని గాఢంగా కౌగలించుకొని విల విల విలపించారు.

అంతలో తెల్లవారింది. మహారాజా! వ్యాసమహర్షి నాకు అనుగ్రహించిన శక్తి అంతతో చల్లారిపోయింది.

తెల్లవారేసరికి ఈ వార్త పాండవులకు తెలిసింది. అప్పటి కప్పుడే నకులుడు ఉపప్లావ్యం వెళ్ళి ద్రౌపదినీ, యితర స్త్రీ జనాన్ని రథం మీద తీసుకు వచ్చాడు ద్రౌపది పుత్ర శోకంతో నిండిన గుండెతో మూర్ఛిల్లి కొంతసేపటికి తేరుకొని :

నా కొడుకులను సంహరించిన అశ్వత్థామకు శిరచ్ఛేదం చెయ్యకపోతే ఆత్మహత్య చేసుకుంటాను అంది.

అప్పుడు కృష్ణుడు ఆమెను ఓదారుస్తూ :

అమ్మాయీ! గురు పుత్రుడు ఈ పాటికే ఏ అడవికో పోయి వుంటాడు. వెతకి చంపినా నీ కెలా తెలుస్తుంది, అనగా ద్రౌపది : అతనికి జన్మసిద్ధమయిన శిరోమణి వుంది. అది తెచ్చి యిస్తే చాలు అని భీమసేనుని దగ్గరగా వెళ్ళి : నువ్వు తప్ప యీ పని చెయ్యగలవారు లేరు, అని రెచ్చగొట్టి రథం ఎక్కించింది.

రథం అటు కదలగానే వాసుదేవుడు :

ధర్మనందనా! అశ్వత్థామ దగ్గర అగస్త్యమహర్షి అనుగ్రహించిన బ్రహ్మ శిరో నామకాస్త్రం వుంది. దానిని మానవులపై ప్రయోగించవద్దని ద్రోణాచార్యులు చెప్పివుంటారు. కాని, ఆవేశ స్వభావుడయిన అశ్వత్థామకు నిగ్రహం లేదు. అందుచేత మనం భీముని

రక్షించుకోవాలి – అని సహదేవునీ, సాత్యకినీ శిబిర రక్షణలో వుంచి తన రథం మీద ధర్మరాజునీ అర్జునునీ ఎక్కించుకొని త్వరిత గతిని నడిపించాడు.

అప్పటికే భీమసేనుడు భాగీరథీ నదీ తీరాన వున్న వ్యాస మహర్షికి నమస్కరించి, అశ్వత్థామ కోసం అన్వేషిస్తున్నాడు.

దేహ మంతా విభూతి పూసుకొని, తపో దీక్షలో వున్న అశ్వత్థామ కనిపించగానే బాణం సంధించి భీముడు :

ఓరీ కపట చిత్తుడా! చాలించు నీ తపస్సు. రా యుద్ధానికి! అంటున్న వేళకు కృష్ణుని రథం కూడ అక్కడకు చేరింది.

చూశాడు అశ్వత్థామ రోష తామ్రాక్షుడై ఒక దర్భ తీసుకొని అభిమంత్రించి బ్రహ్మ శిరో నామకం విడుస్తూ అపాండవం చేసిరా అన్నాడు.

అది చూసి అర్జునుడు కూడా గజగజ లాడుతూంటే:

అర్జునా! గురు పుత్రుడు బ్రహ్మశిరో నామకం ప్రయోగించాడు. నువ్వు కూడ దానినే ప్రయోగించి ఉపసంహరించు – అన్నాడు కృష్ణుడు.

తక్షణం సవ్యసాచి రథం దిగి గురువులను స్మరించి అస్త్రం ప్రయోగించాడు.

ఆ దివ్యాస్త్రాలు ఒకదాని నొకటి ఢీకొని జ్వాలా రోచులతో విజృంభిస్తుంటే నారదుడు వ్యాసునితో వచ్చి ఆ దివ్యాస్త్రాలు ఉపసంహరించండని కోరగా అర్జునుడు ఉపసంహరించినా అశ్వత్థామ ప్రాణ భీతితో ఉపసంహరించక పోవడంతో, నాయనా! నీ శిరోమణి భీమునికిచ్చి ప్రాణ రక్షణ చేసుకో – అన్నాడు వ్యాసుడు.

అప్పుడు అశ్వత్థామ అంగీకరిస్తూ పాండవ పౌత్రులను యిది బలిగొని ఉపశమిస్తుంది – అని శిరోమణి యిచ్చాడు.

అపరిమితానందంతో భీమసేనుడు ఆ మణి తెచ్చి ద్రౌపది కిచ్చి భామా! ఇంతతో అశ్వత్థామ కీర్తి బుగ్గి పాలయింది. ఇక వాడు బ్రతికినా మృత కల్పుడే అనగా ద్రుపద రాజ నందన సంతోషంతో ఆ శిరోమణి ధర్మరాజుకి అర్పించింది.

ఇక్కడ కృష్ణుడు వ్యాస మహర్షితో మాట్లాడుతూ

గురు పుత్రుడు పాండవ వంశీయుల గర్భ విచ్ఛిత్తి పణంగా ఉపసంహరించారు బ్రహ్మశిరో నామకాన్ని. ఇప్పుడది ఉత్తరా గర్భ చ్ఛేదానికి సాగుతూంటుంది. కనక దాన్ని నా సుదర్శనంతో రక్షిస్తాను.

వెనుక ఒకప్పుడు ఈ గురు పుత్రుడు వచ్చి తనకు సుదర్శనం కావాలన్నాడు. అది పొసగ లేదు. అప్పటి నుంచి ఆ ఆశతోనే వున్నాడు. అని నాటి విశేషాలు చెప్పి సుదర్శనాన్ని విడిచి శిశువును రక్షించాడు.

అని వైశంపాయనుడు సౌప్తిక పర్వం ముగించి స్త్రీ పర్వం ప్రారంభిస్తున్నాడు.

సౌప్తిక పర్వం సమాప్తం

శ్రీ సాంగత్య విధాయి వి
కాసోల్లాసిత కటాక్ష కరుణామయ మూ
ర్తీ! సారబోధ భరిత
వ్యాసాది మనోనివాస! హరి హరనాథా!

# స్త్రీ పర్వం

# గాంధారి

భారత యుద్ధం ముగిసింది ;

అంతా అయిపోయింది.

పదునెనిమిది రోజుల వ్యవధిలో ఉభయ పక్షాల యోధులూ నేల కూలారు. అటు పాండవు లయిదుగురూ, సాత్యకి. కృష్ణుడు, యుయుత్సుడు.

ఇటు కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామలు మిగిలారు, అని సంజయుడు చెప్ప డంతో ధృతరాష్ట్రుడు మొదలు విరిగిన చెట్టులా నేల కూలాడు. పరి పరి విధాల శోకించే ప్రభువును సంజయుడూ, విదురుడూ ఓదారుస్తూ, మందలిస్తూ వేదాంతమార్గం తెలిపి :

ప్రభూ!

ఇదంతా నీ లోభంవల్లనూ, నీ కొడుకు దుర్బుద్ధి వల్లనూ సంభవించింది. చేతులారా చేసుకుని చింతించడం దేనికి!

అంతే కాదు. ఇప్పు డెవరి కోసం ఈ శోకం. పితృ, పితామహ, పుత్ర, పౌత్ర, భాతృవర్గమంతా పోయింది. అల నాడు భీష్మ పితామహులతో పాటు, ఆచార్య ద్రోణులూ, విదురుడూ, నేనూ కూడా కృష్ణుని సందేశం వినుమని చెప్పినా నీ చెవి కెక్కలేదు, నీ కొడుకు సరే సరి.

దాని ఫలం కదా యిది. ఇంక శోకించకు, అన్నాడు సంజయుడు. అనంతరం విదురుడు :

మహారాజా! ఈ లోక మంతా నిస్సారం అని గ్రహించిన వివేకులు దేనికీ శోకిం చరు. ఒకయిల్లు మారి మరో యింట దిగుతున్నాం. అలానే మాసిన వస్త్రం విప్పి మరోటి కట్టుకుంటున్నాం. అంతా దేనికి!

కుమ్మరి కుండలు చెయ్యడానికి సారెమీద మట్టి ముద్ద పెడతాడు. అందులో కొంత తడియారి విరుగుతుంది. మరొకటి కుండగా తయారు కాకుండానే పాడవుతుంది. తయా రయినా ఆరబెడుతూంటే ఒకటి విరుగుతుంది. వాటిని కాచడానికి ఆవలో పెట్టినపుడు కొన్ని విరుగుతాయి ఇంకా మిగిలినవి మనం వాడుతూండగా పగులుతాయి. మన జీవితాలూ యింతే.

పిండం ఏర్పడే సమయంలో గర్భస్రావంవల్ల కొన్ని, ప్రసవ వేళ కొన్ని, బాలారిష్టా లతో కొన్ని, యౌవనంలో కొన్ని, వార్ధకంలో కొన్ని .... యిలా జీవాలన్నీ పోయేవే కాని మిగిలేవి లేవని ఎరుగరా ప్రభూ!

ఇది తెలిసిన వారెవరూ శోకాన్ని దరిజేర నివ్వరు. ఈ సంసారం ఒక కారడవి. బంధు మిత్ర పుత్రాదులు క్రూర మృగాలు. భార్య దీర్ఘ రోగం. వార్ధకం మత్త గజం, అని తెలియని వాడవు కావు.

ఈ శరీరం రథం, సత్త్వ గుణం దీని సారథి, ఇంద్రియాలు గుర్రాలు, బుద్ధి వ్యాపారం పగ్గం. అయితే ఆ గుర్రాల చిత్తానుసారం రథం వదలిన వాడు సంసార సాగరంలో కొట్టు మిట్టాడుతాడు. అలా కాక గుర్రాలను తన అదుపులో ఉంచుకోగలవాడు సుఖ దుఃఖాది ద్వంద్వాలకు అతీతుడుగా జీవిస్తాడు.

అని వివరించే వేళ విజయం చేసిన వ్యాస మునీంద్రుడు కూడా ధృతరాష్ట్రునికి మరి కొంత మనశ్శాంతి కలిగించి, అనంతర కర్తవ్యం ఉపదేశించి వెళ్ళాడు.

అప్పుడు తేరుకున్న ధృతరాష్ట్రుడు విదురునితో :

గాంధారినీ, కుంతినీ, మిగిలిన వధూ జనాన్నీ తీసుకుని ప్రయాణం సాగించాలి. కురు క్షేత్రానికి వెళ్ళి అగ్ని కార్యం పూర్తి చేయించాలి, అన్నాడు.

ప్రళయకాల జ్వలన జ్వాలల చిక్కిన అరణ్య మృగాక్రోశనంలా అంతఃపుర స్త్రీల ఆక్రందన ధ్వనులు రేగగా, విదుర సంతతి మహా మనీషి గొంతు తడబడగా వారందరినీ ఓదార్చి, వారి వారికి తగిన వాహనాలు సమకూర్చి కురు క్షేత్రానికి నడిపిస్తున్నాడు.

దారిలో కృపాచార్యుడూ, కృతవర్మ, అశ్వత్థామ ఎదురయి ధృతరాష్ట్రుని చూచి గద్గద కంఠంతో దుర్యోధనుని వీర మరణ వార్త వినిపించారు. అనంతరం కురు వంశా చార్యుడు కృపాచార్యుడు గాంధారిని సమీపించి

మహారాణీ! నీ కుమారులు వీరోచితంగా పోరాడి స్వర్గం చేరారు. అక్కడ దివ్య భోగాలు పొందుతూంటారు. ఎందుకమ్మా! వారికోసం శోకిస్తావు. అసంఖ్యాకంగా దాన ధర్మాలు చేసినవారు పొందలేని దివ్య లోకాలు చేరిన వారికోసం విచారం అనవసరం!

పయిగా, పాండవులు విజయశ్రీ సముపేతులయారని అనుకుంటున్నావేమో! నిజానికి వారి విజయం ఏం విజయమమ్మా! ఉపపాండవులతో పాటు ధృష్టద్యుమ్నాదు లందరినీ నిన్ననే నేలపాలు చేశాం. ఏం మిగిలింది వారికి! అని సర్వ విషయాలూ వివరించి వారు నిష్క్రమించారు.

## ధర్మరాజు

ధృతరాష్ట్రుడు కురు క్షేత్రానికి వస్తున్నాడని విన్న ధర్మరాజు :

కృష్ణా! ఇప్పుడు నేను ఆ మహారాజును చూడడం అవసరం కదా! అందరం వెళ్ళి ఆయనను పరామర్శించాలి, అన్నాడు.

పాండవులతో పాటు సాత్యకి కూడా వెళ్ళాడు. ద్రౌపదీదేవి నిర్భర దుఃఖంతో వడిచింది. ఆమె వెంట పాంచాల, మత్స్య దేశ స్త్రీలందరూ వచ్చారు. అదే సమయానికి యుయుత్సుడు దుర్యోధనాదుల నారీమణులందరినీ తీసుకువచ్చాడు.

ధృతరాష్ట్రుని వెంట వచ్చిన స్త్రీలందరూ ధర్మరాజును చూసి పరి పరివిధాల ఆడిపోసుకుంటూంటే పాండవాగ్రజుడు తలవంచి నిలబడ్డాడు.

నెమ్మదిగా ధృతరాష్ట్రుని సమీపించాడు.

ఆయన ప్రక్కనున్న వారు, ధర్మరాజు వచ్చాడని చెప్పారు.

పెత్తండ్రి పాదాలకు ధర్మరాజు నమస్కరించాడు. ధృతరాష్ట్రునికి గుండెలో మంట పుట్టినా, పైకి వాత్సల్యంతో ధర్మజుని కౌగలించుకొని, ఓదార్పు మాటలు పలికాడు. భీమార్జున నకుల సహదేవులు కూడా వచ్చినట్లు చెప్పగా, భీము డనేమాట వినబడడంతో ఆయన గుండెలో నిప్పు పుట్టింది.

అది గ్రహించాడు వాసుదేవుడు. అంతకుముందే తయారు చేయించిన భీముని ఆకారం గల ఇనుప విగ్రహం ఆయన ముందు నిలబెట్టగా, ఆయన తీవ్ర క్రోధంతో ఆ విగ్రహాన్ని గట్టిగా కౌగలించుకోగా అది ముక్కలు ముక్కలయి పొడి పొడిగా రాలిపోయింది.

ఆయన గుండెలో సంతోషం పొంగుతూన్నా, పైకి మాత్రం 'అయ్యో, నాయనా, భీమసేనా' అని శోకించడం మొదలుపెట్టాడు.

అప్పుడు నవ్వు రాజిల్లెడు మోముతో వాసుదేవుడు :

మామా! ఎందుకు బాధ పడతావు. నీ బాహు బంధంలో నలిగినవాడు భీముడు కాడు. అది ఇనుపబొమ్మ. నీ మనసు నాకు తెలుసు. పయిగా నీ భుజ శక్తి ఉన్నదే, అది ప్రళయకాల యముని దంష్ట్రలతో సమ మయినది. అందుకే నే నీ ఆలోచన చేశాను.

అదీ కాక మామా! ఇప్పుడు నువ్వు ఈ పాండవు లయిదుగురునీ సంహరించినా నీ కొడుకులలో ఒకడయినా బ్రతికి వస్తాడా! ఎందుకింత ఆగ్రహం!

వేదాలు చదివావు, శాస్త్ర చర్చలు విన్నావు. సర్వ పురాణాలూ ఎరుగుదువు. లోకం తెలిసిన వృద్ధుల గోష్ఠులు వింటున్నావు. ధర్మ పరిజ్ఞానం ఉంది

అయినా, భీష్మ ద్రోణ విదురులు, సంజయుడు, నేను అందరం చెవినిల్లు కట్టుకు చెప్పాం. నీ చెవి కెక్కలేదు

ఆనాడు జూదంలో నెగ్గిన గర్వంతో సభా మధ్యానికి ద్రౌపదిని తెచ్చి వస్త్రాపహరణం చేసిన వారు కదా నీ కొడుకులు. అటువంటి దుష్టులను చంపినందుకు కదా నువ్వు ఇప్పుడు భీమసేన సంహారానికి సంకల్పించావు. ఇప్పటికయినా నీ కొడుకుల దురాగతాలు తెలుసు కుని వారి పీడ వదిలినందుకు శాంత చిత్తంతో వుండు, అన్నాడు.

వాసుదేవా! నువ్వు చెప్పినదంతా నిజమే. కాని పుత్ర మరణ శోకంతో మనస్సు వికలమయి పాపపు కోపంతో ఏమో చెయ్యబోయాను. అందుకు నీకు కోపం రావడం సహ జమే. ఇప్పుడింక నీ మాట ప్రకారం శాంతితో ఈ పాండవులతో ప్రేమగా ఉంటాను, అన్నాడు.

అనంతరం యుయుత్సుని కూడా దగ్గరగా తీసుకున్నాడు.

ధృతరాష్ట్రుని కోరిక ప్రకారం పాండవు లయిదుగురూ గాంధారిని పరామర్శించడానికి వెళ్ళారు. అందరూ పాదాభివాదం చేశారు. ఆత్మ నందనుల మరణంతో శోక భరమయిన గాంధారి, ధర్మరాజును శపించడానికి ఉద్యుక్తు రాలవుతున్న వేళకు వ్యాస మహర్షి విజయం చేసి :

అమ్మాయీ! ఎందుకమ్మా వీరిమీద అంత కోపం! నీ పెద్దకొడుకు యుద్ధానికి వెడుతూ నీ దగ్గరకు వచ్చి చేతులు జోడించి : అమ్మా! ఆశీర్వదించు, అని అడిగినప్పుడు "య తో ధర్మ స్తతో జయః" అన్నావు గుర్తుందా!

నీ మాట ప్రకారం ధర్మమే జయించింది. ఇప్పుడింక అసూయా గ్రస్త హృదయంతో ధర్మం తప్పడం నీ వంటి దానికి ఉచితమా! ప్రజలందరూ ధీర బుద్ధివని కొనియాడుతున్నారు నిన్ను. నీ వంటి శాంత చిత్త, లేదని నే నెరుగుదును. అటువంటి గుణ శీలవయిన నువ్వు మాత్సర్యానికి లొంగకూడదు, అన్నాడు.

గాంధారి : నేను అసూయాపరురాలను అనుకోకండి. బాధతో మనసు కలత పడింది తప్ప ఈ బిడ్డలు కుంతికి యెంత ప్రేమ పాత్రులో నాకూ అంతే. దుర్యోధనుని తులువ తనంతో శకుని కర్ణ దుశ్శాసనుల దుష్టత్వంతో మా కురువంశం యీ దశకు చేరింది. అందరు

కొడుకులనూ కడతేర్చినా నా మనసు బాధపడలేదు. కాని ఈ వసుదేవ నందనుడు చూస్తూండగా భీముడు తన గదా దండంతో దుర్యోధనుని నాభికి దిగువ భాగంలో కొట్టడం అన్యాయం కాదా! అదే నన్ను మరీ వేధిస్తున్నది.

భీముడు ఆ మాటలు వింటూనే గజ గజ వణుకుతూ, వినయంతో వంగి

అమ్మా! ఒక్కమాట విను. ధర్మమో అధర్మమో ఆలోచించే అవకాశం లేదప్పుడు. నా ప్రాణ రక్షణ కోసం అలా చెయ్యక తప్పలేదు. ఇప్పుడు న్యాయా న్యాయాలు గురించి మాట్లాడు తున్నారు కనక చెపుతున్నాను. ఇంతకాలంగా మీరు ధర్మరాజుకు చేసిన పరాభవా లన్నీ న్యాయ సమ్మతాలేనా! అన్నీ ఎందుకు!

ద్రౌపది రజస్వలయై ఏకవస్త్రంతో ఉండగా నిండు సభకు రప్పించి ఎన్ని కూతలు కూశారు మీ వారు. అక్కడితో ఆగారా!

ఆ పుణ్యశీలకు తన తొడలు చూపించాడే నీ కొడుకు. అప్పుడు నా మనస్సు ఉడికి పోయి ఆ తొడలు నా గదా దండంతో విరగ కొడతానని ప్రతిజ్ఞ చేశాను. అప్పుడే ఆ పని చేసేవాడిని, కాని, మా అన్నగారు అడ్డు చెప్పడంతో ఆ మాటకు కట్టుబడి ఆగిపోయాను.

అంతేకాదు, ఈ వాసుదేవుని రాయబారానికి పంపుతూ మనం అన్నదమ్ములం మన మధ్య కలహాలు చూసి పదిమంది వేలెత్తి చూపి ఆనందించకుండా శాంతంగా ఉందాం. పెద్దల మాట విని మా రాజ్యం మా కియ్యి. అని చెప్పి పంపాను. అయినా వినలేదు వాడు. ఏం చేస్తాం. ధర్మరాజు రాజు కాకనూ తప్పలేదు. నా ప్రతిజ్ఞ నెరవేర్చుకోకనూ తీరలేదు.

అమ్మా! యుక్తా యుక్త వివేకం కల నువ్వు బాగా ఆలోచించు, అన్నాడు.

గాంధారి :

ఆ చావు చావదగు య
న్నీ చనకున్ వాని వలన నిక్కం బరయన్
నీ చెప్పిన యన్నియు గల
వా చెయ్దియు తగవ నీకు యది యట్లుండెన్.

అంతవరకూ బాగానే ఉంది కాని నాయనా, యుద్ధంలో శత్రువులను చంపి పారేస్తారు. కాని ఆ శత్రువు శరీరం చీల్చి పచ్చి నెత్తురు త్రాగే క్రూరాత్ము లుంటారా యెక్క డయినా! అని అడిగింది.

భీముడు : అమ్మా! అలనాడు సభలోకి ద్రుపదరాజ నందనను తెచ్చి వస్త్రాపహర ానికి వాడు సాహసించినప్పుడు నేను చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవడానికి ఆ గుండెలనుండి

జారే రక్తం దగ్గర పెదవి ఉంచానే కాని మనిషి రక్తం త్రాగడం మహా పాతకం అని ఎరుగనా!

మరోమాట ఏమంటే, అప్పుడలా రక్తపానం చేస్తున్నట్టు కనిపిస్తే ప్రతిపక్ష వీరులందరూ భయపడతారని కూడా తెలుసు. అంతే తప్ప తమ్ముడి రక్తం త్రాగే పాపిష్ఠి వాడినా!

గాంధారి: సరే నాయనా! వందమందినీ నేలకూల్చావు కదా! అందరూ మీకు అన్యాయాలు చేశారా బాబూ! ఈ ముసలితనంలో అంధులకు ఊత కర్రగా అయినా ఒక్క బిడ్డను మిగిల్చినా నీ ప్రతిజ్ఞ తీరదనుకున్నావా!

మిగిలిన ఒక్కడూ మీ అన్నయ్యను రాజ్యం ఏలనివ్వడనుకున్నావా! ఇంతకూ ఆ మహారాజుగా రెక్కడయ్యా?

ధర్మరాజు: అమ్మా! నే నిక్కడే ఉన్నాను; ధర్మరాజును. నీ పుత్రులను చంపించిన ఈ పాపాత్ముడిని శాపంతో కడతేర్చవమ్మా! ఈ భూమండలంలోని రాజులనూ, వారి అనుచర వర్గాన్నీ నాశనం చేసిన పాపికి తగిన దండన విధించవమ్మా! నా కెందుకమ్మా యీ రాజ్యం. స్నేహితులు, చుట్టాలు, బిడ్డలు యిందరూ మరణించారు నా వల్ల. అటువంటి ద్రోహ బుద్ధికి రాజ్య భోగా లెందుకమ్మా! అని మాట రాక రెండు చేతులూ జోడించి నుదుట చేర్చాడు.

అప్పు డా మహాపతివ్రత కనులకు గట్టిన బట్ట సందులనుండి కను చూపు ధర్మరాజు పాదాల చివర పడింది. ఆ చూపులోని వేడికి ధర్మజుని పాదాంగుళులు కంది ఎర్రబడడం చూసిన అర్జునుడు వాసుదేవుని వెనుకకుచేరి నిలబడగా, మిగిలిన భీమ, నకుల సహదేవులు కళ్ళు గిర్రున తిరిగి తడబడి దూరంగా నడిచారు.

అప్పటి కావిడ శాంతించి:

నాయనా! వెళ్ళి మీ అమ్మను చూసి రండి, అంది. అందరూ కుంతీ దేవి దగ్గరకు వెళ్ళారు.

పదమూడేళ్ళయింది ఆ కన్నతల్లి తన బిడ్డలను చూసి.

ఇన్నేళ్ళుగా వారు అడవులలో, అజ్ఞాత వాసంలో పడిన క్లేశాలకు తోడు నిన్నటి యుద్ధంలో ఉపపాండవు లందరూ మరణించిన శోకంలో వున్న బిడ్డలను చూచి కన్నీరు మున్నీరు కాగా, గొంతు తడియారి మాట రాలేదు. పాండవులు కూడా అంతకు మించిన దుఃఖంతో ఆమె పాదాల మీద వ్రాలగా కుంతీ దేవి ఒక్కొక్కరి మీద చేతులు వేసి వెన్ను దువ్వుతూ శరీరమంతా ఆప్యాయంగా తడుముతున్నది.

యుద్ధసమయంలో శస్త్రాస్త్ర ఘాతాలతో బొబ్బలెక్కిన చోట్ల మరొకసారి దువ్వి, వేడి నిట్టూర్పులు విడుస్తూ, దగ్గరగా తీసుకుంటూ వాత్సల్యంతో పలకరిస్తున్నది

అప్పటికి శోకదేవత రూపం ధరించినట్లు కన్నీరే మేలి ముసుగుగా తడబడే అడుగులతో ద్రౌపదీదేవి తన అత్తగారిని సమీపించి :

అత్తా! ఎన్నాళ్ళయిందో నీ మనుమలు నిన్ను చూసి. వా రందరూ ఏరి? ఇంకా రారేం! అంటూ మూలం తెగిన తీగలా నేల వ్రాలింది.

ఆమె దుఃఖంతో కుంతీ దేవికి దుఃఖం కట్టలు త్రెంచుకు రాగా తాను కూడా కోడలి వెన్నుమీద వ్రాలి యింతసేపు ఏడ్చి, నెమ్మదిగా తేరుకుని, ఆమెను రెండుచేతులతో లేవనెత్తి ఓదార్చి దగ్గరగా తీసుకుంది; అప్పుడందరూ కలిసి గాంధారి దగ్గరకు వెళ్ళారు.

ద్రౌపదీ దేవి ఆమె పాదాల మీదపడి వెక్కి వెక్కి ఏడుస్తూంటే, ఆవిడ ద్రౌపది దేవిని దగ్గరగా చేర్చుకుని :

ఎందుకమ్మా ఏడుస్తావు. మీ అత్తగారిని చూశావా! ఒక్క మనుమడు కూడా దక్కకుండా పోయాడు. ఆ గుండెబాధ చల్లారుతుందా తల్లీ!

నిన్ను నేను ఓదారుస్తాను. మరి నన్ను నువ్వు ఓదార్చాలి కదా! ఇద్దరం పుత్రశోకంతో బాధపడుతున్న వాళ్ళమే.

ఇలా జరుగుతుందని ఆనాడే చెప్పాడు విదురుడు. అయినా నేను ఆపలేక పోయాను. పాపానికి ప్రాయశ్చిత్తం తప్పదు కదా! ఏమిటో అంటున్నాను. కాని అంతా కాలవశమై, సాగవలసిందే. ఇంక శోకించి ప్రయోజనం ఏమిటి! ఊరుకో తల్లీ, అని ఓదారుస్తున్నది.

అనంతరం ఆ మహాపతివ్రతా శిరోమణికి వ్యాసమునీంద్రుని అనుగ్రహంవల్ల దివ్యదృష్టి లభించగా, రణ రంగం అంతా ఆవిడ కళ్ళకు కట్టినట్టయింది.

అతిరథ మహారథుల శవాలు.

మత్తేభాల, సైంధవాశ్వాల కళేబరాలు.

రక్తపుమడుగులో మాంసపు బురదలో ఉన్నాయి.

కుక్కలు, నక్కలు, కాకులు, గ్రద్దలు యథేచ్ఛగా విహరిస్తూ అరగిస్తున్నాయి. కురు క్షేత్రం అంతా ఆవిడ మనో వీధిలో తాండవించింది.

అక్కడకు వచ్చిన వ్యాస మహాముని వా రందరికీ అగ్ని సంస్కారాలూ, పరలోక కర్మలూ సాగించండని ధృతరాష్ట్రాదులకు చెప్పి వెళ్ళాడు.

ఆ మాట వింటూనే అందరూ రణ రంగం చేరి ఎవరి బంధువులను వారు వెదుకుతూ రోధనధ్వానా లారంభించారు.

అప్పుడు గాంధారి : దేవకీనందనా! చూస్తున్నావా! అంతఃపురం విడిచిరాని ఎండ కన్నెరుంగని నా కోడళ్ళందరూ కన్నీటి వాన కురుస్తూ ఎలా శోకిస్తున్నారో!

అటు చూడవయ్యా! వారి మేనమామ శల్యుడు, ద్రుపదరాజు, కర్ణుడు, ద్రోణాచార్యులు, భీష్మాచార్యులు వీరందరూ నేలకూలినా, జ్వాల సన్నగిల్లినా, కాంతితగ్గని అగ్నిలా ఎలా వున్నారో! అడుగో నయ్యా! సుభద్ర కొడుకు గుణభద్రుడు, అభిమన్యుడు యిందరి ప్రభలూ చల్లార్చినవాడు.

అతిమధురంగా వీణా, వేణు గానాలతో నిత్యోత్సవం జరుపుకునే ఈ రాజ వంశీయు లందరూ శునక జంబుక నాదాల మధ్య పడిఉంటే గుండె బ్రద్ద లవుతున్నదయ్యా!

కస్తూరితో, మంచి గంధంతో లేపనం చేసుకునే వీరందరి శరీరాలూ మాంసపు బురదతో నిండి ఉన్నాయి.

చూశావా? ఆ యోధులు! ప్రాణాలు పోయినా చేతిలో కత్తి విడవలేదు కాబోలు. ఆ బిగిసిన పిడికిలి చూస్తూంటే వారు మరణించారని అనుకోగలమా?

ఈ నారీ జనం అందరూ తండ్రినీ, భర్తనూ, బిడ్డలను కోలుపోయి శోక సాగరంలో పడిపోయారు.

కొన్నిశరీరాల అవయవాలు నక్కలూ, రాబందులూ తినేయడంవల్ల, పాపం తమ వారిని కూడా తాము గుర్తు పట్టలేక పోతున్నారు.

కృష్ణా! ఏ జన్మలో చేసిన పాపమో, ఇవన్నీ చూడడానికి మిగిలి వున్నాను ఇంత యినా నాకు చావు రాని పడెయ్య లేదు.

అని నడుస్తూండగా దుర్యోధనుని కళేబరం కంటబడింది.

పడీ పడగానే ఆవిడ మొదలు నరికిన అరటిలా నేలకూలింది. మూర్ఛపోయిన ఆవిడ కొంతసేపటికి తేరుకున్నది. అప్పుడామె వెంటనున్న పరిచారికలు నెమ్మదిగా దుర్యోధన కళేబరం దగ్గరకు తీసుకువెళ్ళారు.

వెడుతూనే ఆ కుమారుని విశాల వక్షం మీద తలవాల్చి కన్నీరు విడుస్తూ :

నాయనా! నేను మీ అమ్మను వచ్చాను. లేచి భక్తితో ప్రణామం చెయ్యాలని

మరచిపోయావా! ఎంత దురదృష్టం పట్టింది. ఇలా ఈ కటిక నేలమీద పీనుగు గుం మధ్య పడవలసి వచ్చిందా నీకు — అంటూ విలపించి, విలపించి :

దేవకీనందనా! వీడు యుద్ధానికి బయలుదేరుతూ నా దగ్గరకు వచ్చి ఎంతో భక్తి వినయంతో చేతులు జోడించి, ప్రీతిగా మాట్లాడి :

అమ్మా ! విజయలక్ష్మి నన్నే వరించాలని ఆశీర్వదించు అన్నాడు.

అప్పుడు నే నేమన్నానో తెలుసా! (యతో ధర్మ స్తతో జయః) ధర్మానికి జం లభిస్తుంది నాయనా! అన్నాను.

అలా ఎందుకన్నావని నువ్వడుగవచ్చు కృష్ణా! నాడు - జూదం జరిగిన నాడు వీ చేసిన అకార్యం చూసిన ప్రజలందరూ భయంతో గజ గజలాడుతూ, ఈ పాపానికి ప్రా శ్చిత్తంగా సర్వ కురు కుమారులతో వీరు లందరూ మరణించి తీరుతారు అంతకంటె తక్కు శిక్ష లేదు, అనుకున్నారు.

అందరు ప్రజలు, అనుకున్నమాట అబద్ధం కాదు. అది జరిగి తీరుతుంది. ప్రజా వాక్యం. దాన్ని విన్న నేను, వీడు నా కన్న కొడుకు కదా అని ప్రియంగా మరోమ మాట్లాడితే నా ప్రతిష్ఠ చెడి తీరుతుంది.

అప్రతిష్ఠపాలు కావడం కంటె ఆత్మ హాని లేదు. అంతేకాదు, ఇంకా ఏమన్నా తెలుసా!

నాయనా! యుద్ధంలో వెనుదిరిగిపోతే అపఖ్యాతి వస్తుంది. అపఖ్యాతి కంటె చా మేలు. రణ రంగంలో నిలిచి పోరి పర లోకంలో అమర భోగాలు అనుభవించు, అన్నా

అన్నంత పనీ చేశాడు. కీర్తి ప్రతిష్ఠలు సాధించాడు. అయినా ఎందుకింత బాధ ప తున్నానంటే పుత్ర శోకం.

కడుపు తీపి వదలదు కదయ్యా! అదీకాక ఈ వయసులో ఆయన దిక్కులేని రయ్యారనే బాధ వదలుతుందా!

ఒకనాడు సర్వ రాజ లోకం వీని ఉభయ పార్శ్వాల వంది మాగధులవలె నడ వారు. అటువంటి ప్రభువు ఈ అవస్థలో పడితే గుండె తరుక్కుపోదా!

రత్నాలు పొదిగిన బంగారు ఆసనం మీద,

సుందరీ మణులు వీవనలు వడుతూంటే భోగా లనుభవించే మహారాజు

ఈనాడు గ్రద్దల రెక్కలగాలిలో ఉన్నాడు.

మా మహామంత్రి విదురుడు చెప్పాడు.

ఆయనా చెప్పారు.

చెవి కెక్కలేదు.

విధి నెత్తిమీద కూర్చుంటే ఏం వినిపిస్తుంది. పదకొండక్షౌహిణీలు కొలిచి రాగా యుద్ధానికి వచ్చిన ప్రభువు ఏకాకిగా తన గదా దండంతో పోరు నడప వలసి వచ్చింది.

చతురంగ బలాలతో రాజ్య లక్ష్మితో అలరారుతున్నప్పుడు చూసి ఆనందించాను.

ఈనాడు ఆ భోగాలన్నీ పరాధీనాలయినా చూడక తప్పలేదు, అని అంటుండగా ఎదుట దుర్యోధన పత్ని కనిపించగా :

కృష్ణా! బిడ్డ చావుకంటె కోడలి దుఃఖం నన్ను మరింతగా వేధిస్తున్నదయ్యా! ఈ బాధ ఎప్పటికి చల్లారుతుంది.

చూడవయ్యా, ప్రాణేశ్వరుని గుండెమీద తల మోపి కన్నీరుకారుస్తూ మాటలేకుండా పడి ఉంది.

నా కొడుకేకాదు. మనుమడుకూడా నేలకూలినాడు కదయ్యా! ఇంత కష్టం వచ్చినా నా గుండె బద్దలు కావడం లేదంటే దీన్ని ఇనుముతో చేసి ఉంటాడు బ్రహ్మదేవుడు. కన్న తల్లీ, కట్టుకున్న భార్యా, ఏమయితేనేం, అనుకున్నాడు కాబోలు.

వీర మరణం స్వర్గ ప్రాప్తి హేతువని చెప్పిన వేదాన్ని నమ్మి యిలా చేశాడు, అని యింతసేపు ఏడ్చి మిగిలిన బిడ్డ లందరినీ చూపి:

చూశావా! చేతు లూడి, కాళ్ళు తెగి, తలలు ముక్కలయి పడివున్న వారిని చూస్తే గుండె చెరువుకాదా!

నా కోడళ్ళ రోదన ధ్వని వింటూంటే నా శోకం మరీ పొంగుతున్నది.

మంచి గంధపు నీరుజల్లిన ప్రదేశాలలో సైతం కాలు మోపడానికి సంకోచించే నా రాణి వాస స్త్రీలు ఈ నెత్తురుటేరుల మధ్య పడి ఎలా రోదిస్తున్నారో! ఏ జన్మలోనో నేమా, ఆయనా చేసుకున్న పాప ఫలం, కాకపోతే నూరుగురు బిడ్డలనూ మాకు కాకుండా చేస్తాడా మీ ధర్మరాజు!

అని నడుస్తూండగా దుశ్శాసనుని కళేబరం కనిపించింది.

చూశావా! భీమ గదా ఘాతాలతో అవయవాలన్నీ పట్టు తప్పి పోయి పడివున దుశ్శాసనుడు. వీడి వేడి నెత్తురు త్రాగాడు కదా భీమసేనుడు.

వీడు తన అన్నగారికీ, కర్ణుడికీ ప్రీతి కలిగించడానికి ద్రుపదరాజ నందనను కొప పట్టి లాగి ఎంత అవమానం చేశాడు, అని తలవంచి కన్నీరు తుడుచుకుని :

అప్పుడు భీమసేనుని అంతరంగం ఎంత క్షోభించి ఉంటుంది. తత్ఫలంగా యిం జరిగింది.

ఆ నిండు కొలువులో వీడు చేసే తుంటరి పని చూసి నేను దుర్యోధనునితో ఏమన్నా ఎరుగుదువా!

నాయనా! ఈ పాంచాలి పరమ పవిత్ర చరిత్ర, పయిగా వాసుదేవుని రక్ష ఉన్నది అటువంటి ఇల్లాలిని యింత నీచంగా పరాభవించడం వల్ల ఎంత కీడు జరుగుతుందో తెలియద మీకు. శత్రు భయంకరుడయిన భీమసేనుని ఎందుకంతగా తూలనాడుతారు. నా మాట వి పాంచాలిని విడిచిపెట్టండి, అన్నాను.

క్రూరుడూ, నీచుడూ అయిన నీ మేనమామ శకునిని వెళ్ళగొట్టి పుణ్య శీలు రయి పాండవులతో సఖ్యం చేసుకుని, సుఖంగా ఉండు, అన్నాను.

అంటే వింటాడా! విధి వక్రించి నెత్తిమీద కూర్చుంటే.

ఆనాటి పరాభవ వాక్కులతో పగ బట్టిన త్రాచులా భీమసేనుడు ఈనాడు ఇంత చేశాడు. అందుకు తప్పు పట్టనయ్యా! తప్పుపట్టను.

కాని — మనిషి రక్తంతాగే మనుషులుంటారా! చూశావా! సింహం తన పంజాతో చీల్చి పారేసిన ఏనుగులా ఎలా ఉన్నాడు దుశ్శాసనుడు! అని మరింత ముందుకు సాగింది. ఎదురుగా వికర్ణుని దేహం కనిపించింది.

కృష్ణా! నల్ల మబ్బుల మధ్య మెరుపు తీగలా మత్తేభ కళేబరాల మధ్య ఎలా ప్రకా శిస్తున్నాడో, వీడు వికర్ణుడు. ధనుర్విద్యాభ్యాస వేళ నారి సారించడంలో రాయిలా గట్టి పడిన ఈ బిడ్డ ముంజేతిని తన వాడి ముక్కుతో చీల్చలేకపోతున్నది ఆ గ్రద్దపిల్ల.

అదిగో వాని భార్య. కాకులమధ్య, గ్రద్దలమధ్య పడి రోదిస్తున్నది.

అదిగో అది దుర్ముఖుని కళేబరం. నక్కలూ, తోడేళ్ళూ తినగా మిగిలిన వాని వదనం సప్తమీ చంద్రబింబంలా కనిపించడం లేదూ!

నడు కృష్ణా! అదిగో వాడు వివింశతి! నిరంతరం సుందరీ జన నాట్యాలతో, సంగీత సల్లాపాలతో ఉండేవాడు. ఇప్పుడు నక్కల అరుపులు వింటున్నాడు.

ఎవరయ్యా ఈ బాలయోధుడు. అలసిపోయి నిద్రిస్తున్నట్టు కనిపిస్తున్నాడు.

వీడు నీ మేనల్లుడు, సుభద్రకొడుకు, అభిమన్యుడు.

యుద్ధంమీద వేడుకతో మహామహులు పన్నిన వ్యూహంలో ప్రవేశించి రథ, గజ, తురగ వాహినులను చీకాకు పరుస్తూంటే, తాళలేక దుర్యోధన, ద్రోణ, కర్ణ, శల్య, కృప, అశ్వత్థామాది యోధులందరూ ఏకమై చుట్టుముట్టి పడగొట్టారు వీనిని

చూడవయ్యా! ఆ బిడ్డ ఉత్తర.

నిన్న మొన్నటిదాకా సిగ్గుతో చెలికత్తెల చాటున నిలబడి చూసేది ఈ బాలుని, ఇప్పుడు వాని గుండెమీద తల వాల్చి ఏడుస్తున్నది.

తన తొడమీద వాని తల ఉంచుకుని, అరచేతితో నుదురు తడుముతూ కన్నీరు జారుస్తున్నది. ఏమంటున్నదో విన్నావా!

దేవ సముడయిన అర్జునుని నందనుడవు. అచ్యుతుని మేనల్లుడవు. ఎవడు నిన్ను నేలకూల్చినది!

ద్రోణాచార్యులవారు, రాధేయుడు, కృపాచార్యులు, అశ్వత్థామ వారంతా మహా యోధులనీ, నీతితప్పని వారనీ విన్నానే! అంతటి వారందరూ ఏకమై నిన్ను ఎదుర్కొన్నప్పుడు వారి అంతరాత్మలు ఎంత క్షోభించి యుంటాయి.

సర్వ శత్రు సంహారం చేసి, భూమండలం అంతా లభించినా మీ పెద్దలకు సుఖ మెక్కడుంటుంది నువ్వు లేనప్పుడు!

ప్రాణేశ్వరా! నీ ప్రాణం పోయిందని తెలిసి కూడా నే నింకా ఎలా బ్రతికి ఉన్నాను. నిండా ఆరునెలలు కూడా పూర్తి కాలేదే నా పాణిగ్రహణం చేసి ....

అని గోలు గోలున విలపిస్తూంటే చూడవయ్యా కృష్ణా! ఆమె తల్లి, బంధువులూ వచ్చి గుండెకు చేర్చుకు తీసుకు వెడుతున్నారు.

నడవ్వయ్యా! నడు ....

అదిగో విరాటుడు, అవ్వల ఉత్తరుడు, అక్కడే వాణ్ణి చంపి, నేలకూలిన కాంభోజ రాజపుత్రుడు.

ఇటు చూడు !

నీ పాండవు లందరి భుజ బల పరాక్రమాలనూ తృణ ప్రాయంగా భావించి నా బిడ్డ ఈ యుద్ధానికి సిద్ధపడటానికి కారణభూతుడయిన మహా వీరుడు కర్ణు డిడుగో :

మదాంధ సింధురం ద్విరదమహోగ్ర విక్రమానికి నేల కూలినట్లు లేదూ !

ఈ వీరుడు, రోష దూషితుడు, పరుషభాషి అయినా ధైర్య ధనుడు దాన శీలి దుర్యోధనుని ఆశలన్నీ వీని అరచేత ఉండేవి.

అదిగో ఆ యోధుని నారీ జనం విల విల విలపిస్తున్నది. అందరి కంటె గుండెలు బ్రద్దలయేలా శోకిస్తున్నది తల్లి రాధ. కాకులూ, గ్రద్ధలూ తినగా మిగిలిన అతని వదనం కృష్ణపక్ష చతుర్దశీ చంద్రుని వలె ఉన్నదయ్యా !

మా కురువృద్ధుని బాహ్లికుని చూచావా ! నేలకూలినా ముఖకాంతి తగ్గ లేదు. పూర్ణిమా చంద్రకాంతు లీనుచున్నది ఆయన వదనం.

ఎవరయ్యా ఇక్కడ !

అలనాడు అరణ్యంలో ద్రౌపది చెయ్యి పట్టిన నాడే వీడు మృతులలో లెక్క. ఆనాడు వారు తమ సోదరి దుస్సల సౌభాగ్యాన్ని తలచి వదలి పెట్టినారు. కాని ఆ పాప ఫలం వెన్నాడి కట్టి కుడిపింది. ఎందరు యోధులు వీని ప్రాణ రక్షణ కోసం కంచుకోట కట్టి నిలిచినా కాలం అర్జున రూపంలో వీనిని కబళించింది.

అదిగో నా బిడ్డ దుస్సల ! తన భర్త శిరసు దొరకక ఎలా వెర్రిగా పరుగులు పెడుతున్నదో !

ఆనాడు అర్జునుడు ప్రతిజ్ఞ చేసినట్టు విని తన భర్తతో ఈ బిడ్డ ఏమన్నదో ఎరుగుదువా!

కురుసేనమీద విశ్వాసం వద్దు. మా విజయుడు శపథం చేశాడంటే అది జరిగి తీరుతుంది. కనక యిప్పుడే వెళ్ళి ధర్మరాజును శరణు వేడితే ఏ ప్రమాదం ఉండదు, అంది.

వింటున్నావా ! యిప్పుడు దాని విలాపం. తోడబుట్టు వదుచ సౌభాగ్యం కోలుపోయి ఏడుస్తూ పడి వుంటుందని తెలియకుండానే ఈ అవస్థ నా నుదుట రాసి సంతోషిస్తున్నారా, అన్నయ్యా ! అంటున్నది, విన్నావా ! అని ముందుకు సాగి :

సరే, నడు,

ఇదుగో, వారి మేనమామ కదా శల్యుడు. సాక్షాత్తు మాద్రికి తోడబుట్టినవాడే ! ఆయనను కూడా వదలలేదు ధర్మరాజు. అదిగో ఆ శరీరం బోర్లపడి ఉంది. నుదురు నేలకు

అని, నాలుక బైట పడింది. ఆ నాలుకను కాకులు పొడుచుకు తింటున్నాయి చూశావా! నడు - నడు.

అదిగో! మా వంశోద్ధారకుడు! శాంతనవుడు తండ్రి కోసం రాజ్యం విడిచాడు.

బ్రహ్మచర్య దీక్ష వహించాడు. పౌరుషానికి ఆయన తరువాత కాదయ్యా మరెవరి పేరు చెప్పినా!

అటు దేవసేనాని కుమారస్వామి ఇటు మా వంశవృద్ధులు భీష్ములు. కల్పాంతవేళ ప్రచండ భానుడు చల్లబడి భూమి మీద పడిన ట్లనిపిస్తున్నది. ఈయనను చూస్తూంటే, ఈ శర తల్పం మీద

వారెవరూ! ధనుర్వేద వేత్త ద్రోణాచార్యులా! ఇంద్ర పరుశరాము లెరిగిన అస్త్రాలన్నీ ఈయన అధీనంలో ఉన్నాయి. మా కురు వంశీయులు మీ సాత్యకి అందరూ ఈయన శిష్య సంతానమే. వీరుడన్న వాడెల్ల తలవంచి మ్రొక్కవలసిన పాదాలు, అవి.

ఇప్పుడా పవిత్ర పాదాలను నక్కలు కొరుక్కు తింటున్నాయి. అదుగో కృపాచార్య సోదరి కృపి; ద్రోణుల సతీ మణి! రోదన సామం వినిపిస్తున్నది. ఆ విద్యాగురుని శిష్య లందరూ అస్త్ర, శస్త్ర రథాలు కలిపి కట్టి, చితి పేర్చి సామ గానం చేస్తూ నిప్పు ముట్టించి, మరొక అగ్నిలా ఆయనను ఉంచి, దహించి శోకార్తులై గంగా స్నానానికి వెడుతున్నారు. శర విద్య అస్తమించింది ఆయనతో.

అదుగో సోమదత్త భూరిశ్రవన, శకుని ప్రభృతులు.

సహదేవుని చేతులలో కదా ఈ శకుని తన బిడ్డలతో సహ నేలకూలాడు. మాయా బలంతో ఆనాడు జూదంలో వారి రాజ్యాన్ని అపహరించాడు. దాని ఫలం యిది.

ఈనాడు కృష్ణా! వారి మాయలన్నీ నీ మాయ ముందు పటా పంచ లయాయి. వీడు కాదుటయ్యా సర్వ కురువంశ నాశకుడు.

మేలు చేస్తానని దుర్యోధనుని చేరి మొత్తం అందరినీ వేల కరిపించిన క్రూరుడు వీడు.

అదిగో కళింగపతి, అటు మగధరాజు జయత్సేనుడు. బృహద్బలుడు వీరు ధృష్ట ద్యుమ్న పుత్రులు. వారు కేకయ రాజ నందనులు సింహం పంజాతో చీల్చిన మత్తేభంలా ఉన్నది ద్రోణాచార్యుల చేతులలో నిహతుడయిన ద్రుపదుని శరీరం. ఇదుగో నీ మేనబావ

శిశుపాలుని కొడుకు ధృష్టకేతువు, ఆ ప్రక్కనే వాని కొడుకు సుకేతుడు. దూరంగా విందాను విందులు. ఎందరినని యిలా చూపించను.

మా వంశ దీపం భీష్ములు.

అస్త్ర విద్యా గురువులు ద్రోణులు.

మహాశూరులు కర్ణ భూరిశ్రవస, అశ్వత్థామ, కృప, కృతవర్మ సైంధవులు.

దేవత లయినా ఎదురు నిలవగలరా! కాని పాండవులతో పాటు మీ అన్నదమ్ము లిద్దరూ అటువంటి వారితో పోరి చెక్కు చెదరకుండా ఉన్నారంటే అది దైవ కార్యమేనయ్యా!

అందరూ చెప్పారు, ఇలా అవుతుందని. కాని విన లేదు. ఫలితం అనుభవించారు. అని కొంతసేపు దుఃఖించి ఊరడిల్లి, అంతలో కోపోద్దీపితయై:

ఓ యదువంశీయుడా! సర్వకార్య సాధకుడ వయిన నువ్వు సంకల్పించి ఉంటే ఈ కుటుంబ కలహం శాంతంగా పరిష్కారం అయేదికాదా! కాని ఉపేక్షించి సర్వ రాజవంశ నాశనం చేశావు. జ్ఞాతి వైరాన్ని సంగ్రామంతో కడతేర్చిన ఫలంగా మీ జ్ఞాతులు కూడా యిలానే పరస్పర కలహంతో నాశనం అవుతారు. అంతేకాదు నీ జీవితం కూడా దిక్కులేని దశలో తెల్లవారుతుంది. నా పాతివ్రత్య పుణ్య ఫలం బలిమితో ఈ మాట అంటున్నాను, అంది.

అంతవరకూ మౌనంగా విన్న వాసుదేవుడు చిరునవ్వుతో:

అత్తా! ఏనాడో దూర్వాస మహర్షి మా కిచ్చిన శాపం అదే కదా! చర్విత చర్వణం చేశావు. నీ వంటి వీరమాతకు యింత ఆవేదన ఉచితం కాదమ్మా! నీ కొడుకు చేసిన దుర్మార్గాలు ఎరగని వారెవరు! మనమందరం ఎంత చెప్పినా వాడు వినక ఈ దశకు తెచ్చుకుంటే నీ బాధలో నువ్వు అంతంత మాట లనడం న్యాయమా!

రాచపడుచువు

నువ్వు, నీ కొడుకులు వీర మరణం చెందితే ఎంత గర్వంతో ఉండాలి అంటూంటే గాంధారి శాంతించింది.

అనంతరం ధృతరాష్ట్రుని ఆజ్ఞానుసారం అందరికీ ధర్మరాజు తన పురోహితుడూ సర్వ వైదిక కర్మ నిరతుడు అయిన ధౌమ్యునిచేత అపర కర్మ సాగింపించడానికి నిశ్చయించి విదురుని పిలిపించి, సంజయుని రావించి:

భరత వంశీయులకు తప్ప మిగిలిన వారందరి అగ్నికార్యం మీరు నిర్వహించండి అని చెప్పి తమ వారందరికీ దహన సంస్కారాలు పూర్తి చేయించాడు.

తిలోదకాలిచ్చే సమయంలో కుంతీ దేవి కన్నీ రొత్తుకుంటూ ధర్మరాజును సమీపించి :

నాయనా! కర్ణుడు మీకు అగ్రజుడు. భాస్కరుని దయవలన కవచ కుండలాలతో వీడు నాకు కలిగాడు.

అనగా ధర్మరాజు :

అమ్మా! ఈ మాట ముందే చెపితే యింత జరిగేది కాదు కదా! అని యింతసేపు గోలు గోలున ఏడిచాడు.

అనంతరం యథోచితంగా కర్మకాండ ముగించి భూరి దక్షిణలతో అన్న దానాలతో అందరినీ తృప్తులను గావించి వారి అభినందనలతో ఆనందించాడు

అని వైశంపాయనుడు స్త్రీ పర్వానికి స్వస్తి పలికాడు.

వీణావాద ప్రతిమ నిగమావిర్భవత్సార పుణ్య
శ్రేణీసంపాదిత విమలతాస్థేమ నిర్లేపచిత్త
త్రాణక్రీడాకలన సతతోత్సాహ వద్దివ్యభావా
ప్రాణాపానాహరణ నిపుణ ప్రాపణీయానుభావా॥

ఇది స్త్రీ పర్వం

---

# శాంతిపర్వం

జనమేజయ మహారాజా!

కర్ణుడు తన అన్నగారని విన్న క్షణంనుంచీ ధర్మరాజు మనస్సు వికలమయి - ఇది మొదలుగా స్త్రీలకు రహస్యం దాచే శక్తి నశించుగాక - అని శపించి, అర్జునుని చూస్తూ :

తమ్ముడూ! నాకు ఈ రాజ్యపాలన కాంక్ష కలగడం లేదు, అడవికి పోయి బ్రతకాలని వుంది - అన్నాడు.

ఆ మాటలు విన్న అర్జునుడు, నకులుడు, ద్రౌపది పరిపరివిధాల ధర్మరాజును హెచ్చరించి : సమర్థుడూ, ధర్మపరుడూ అయిన ప్రభువు లేకపోతే ప్రజలు నానా క్లేశాలూ పడతారు. దుర్మార్గులు విజృంభించి అకార్యాలు సాగిస్తారు కనక రాజ్యం ఏలక తప్పదు అన్నారు. ఎట్లో అంగీకరించాడు ధర్మరాజు.

బంధు మరణా శౌచం కారణంగా నదివొడ్డునే కుటీరాలు వేయించి, అక్కడే నెల రోజులు గడిపారు. ఆ సమయంలో ఎందరో మునులూ, మహర్షులూ వచ్చి అనేకానేక లోక ధర్మవిషయాలు బోధించారు.

వ్యాస మహర్షి విజయం చేసి : నాయనా! ఎందుకు శోకిస్తావు. దుష్ట దండన రాజ ధర్మం. ఆ ధర్మం ఆచరించనినాడు దేశం దుండగులమయం అవుతుంది. అందుచేత నువ్వు దుర్బుద్ధులైన వారందరినీ కడతేర్చావు. కనక దీనికోసం విచారం దేనికయ్యా! అని ఓదార్చాడు.

అప్పుడు వాసుదేవుడు : ధర్మనందనా! ఇక నువ్వు సింహాసనం అధివసించి ప్రజా రక్షణ చేపట్టాలి, అని పట్టాభిషేక ప్రయత్నం ఆరంభించాడు.

హస్తినా పురం చేరుతూనే కృపాచార్యులను రావించి ధౌమ్యులవారి సరసన ఆసీనుని చేశారు.

ధృతరాష్ట్రుని దగ్గర గాంధారి కూర్చున్నది. నకుల సహదేవుల మధ్య కుంతి కూర్చున్నది. యుయుత్సుడూ, సంజయుడూ గాంధారికి కొంచెం ఎడంగా వున్నారు.

దేశంలోని వణిక్ప్రముఖులు, పౌరులు సంతోషంతో కానుకలు తెచ్చారు. వచ్చిన అందరికీ ఆదర పూర్వకంగా సత్కారాలు సాగుతున్నాయి.

వీణా, వేణు, గానకళా కోవిదులూ, భరతకళా విదులయిన నార నారీ జనం వచ్చారు.

నవ రత్న ఖచితమయిన బంగారు సింహాసనంమీద శార్దూల చర్మం పరిపించి పవిత్ర గంగాజలం స్వర్ణ కలశాలలో వుంచి పంచ గవ్యాలతో వేద మంత్ర యుతంగా సంస్కారాలు సాగింపించి ద్రౌపదీ సహితుడయిన ధర్మరాజు అగ్నిహోత్రుని హోమాదులతో తృప్తుని గావించిన అనంతరం వాసుదేవుడు చక్ర ధారియై నిలచి :

ధర్మనందనా! ఈ భూమండలానికి అధీశ్వరుడవై సర్వ ప్రజా రంజకంగా పాలించ వయ్యా! - అని చిరునవ్వుతో సదస్య లోకాన్ని కలయ జూశాడు.

మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. శంఖ భేరీ నాదాలు దిశాంతాలు సోకు తున్నాయి. అప్పుడు తనను ఆశీర్వదించే వేదవేదులకు చేతు లెత్తి నమస్కరించి :

అయ్యా! మీరందరూ ఈ ధృతరాష్ట్ర మహారాజు ఆజ్ఞ పాలించడమే నాకు సంతోషం అని తల దించుకున్నాడు.

అనంతరం భీముని యువరాజుగా చేసి, సంధి, విగ్రహాది సర్వరాజ్యాంగ విషయ నిర్వహణ భారం విదురుని మీద వుంచి, అర్థమంత్రిగా యుయుత్సుని నియోగించి, సేనల పరిచారకుల జీత, భత్యాలు నకులుని చేతులలో పెట్టి, ఇరుగు పొరుగుప్రాంతాల ఆక్రమణలు అర్జునుని భుజస్కంధాల మీద మోపి, విప్ర దేవతా పూజలూ, యజ్ఞ యాగాది సర్వ కార్య నిర్వాహక భారం ధౌమ్యుల వారిదని చెప్పి, తన అంతరంగ సచివుడుగా సహదేవుని తీసుకున్నాడు.

మహా నగరాలలో, జనపదాలలో అన్న సత్రవులు నిర్మించి, రాజ పథాలలో దాహ శాంతికి చలివేంద్రలు నడుపుతూ, సర్వ ప్రజా రంజకంగా పరిపాలిస్తున్నాడు ధర్మరాజు. భీమునికి దుర్యోధన మందిరం, అర్జునునికి దుశ్శాసన మందిరం, దుర్మర్షణ, దుర్ముఖుల భవ నాలు నకుల సహదేవులకూ యిచ్చి, మిగిలిన వారిని వారి వారి ఆవాసాలలో ఉండునట్లు ఆజ్ఞాపించాడు.

దేవతా పూజలూ, పితృదేవతల ఆరాధనలూ, అతిథి అభ్యాగతుల సత్కారాలూ, అనాథల దీనుల పోషణ భారాలూ, దేశ దేశాలనుంచి వచ్చే విద్వాంసులకు సముచిత సమ్మా నాలూ జరుపుతూ, దేశంలో ఆకలి దప్పుల బాధ లేకుండా స్వయంగా చూసుకుంటున్నాడు.

ఆ రోజులలో ఒకనాడు ప్రభాత వేళ ధర్మరాజు వాసుదేవుని చేరి నమస్కరించి కుశల ప్రశ్నలు వేశాడు. మర్యాద లన్నీ ముగిసిన అనంతరం వాసుదేవుడు రుచిర స్మిత వదనంతో :

ధర్మనందనా! సర్వ ధర్మవిదుడు త్రికాలజ్ఞుడు అయిన భీష్మ పితామహుడు వశిష్ఠుల వారి శిష్యుడుగా సర్వ విషయాలూ గ్రహించాడు. ఆయన కన్ను మూస్తే ధర్మ మర్మాలు చెప్పగల వాడు లేడు. కనక ఆయన పద సమీపంలో సావధానుడవై నీ సంశయాలన్నీ తీర్చుకో అన్నాడు.

హర్ష పులకిత చిత్తుడై ధర్మరాజు :

దేవకీనందనా! ఆయన ఉత్తరాయణం కోసం ఎదురు చూస్తున్నాడు. ఈ మధ్యలో ఒక్కమారు నిన్ను చూడాలనే కోరిక కూడా వుంది. అందుచేత నువ్వుకూడా రా - అన్నాడు.

ప్రక్కనే వున్న సాత్యకిని చూశాడు వాసుదేవుడు :

ఆయన కనులలో భావం అవగతమయిన సాత్యకి సారథి దారుకుని పిలిచి రథం సిద్ధం చేయించి భీమార్జున నకుల సహదేవ సంజయ యుయుత్సులతో కృపాచార్యులకుకూడా కబురు పంపాడు.

అందరూ రాగానే ధర్మరాజు తన నిశ్చయం తెలిపి వారిని వెంట బెట్టుకొని పితామహుల దగ్గరకు వెడుతూ : తమ్ముడూ కిరీటీ! ఇకనుంచి పితామహుల దగ్గరకు సైనికులూ, అంతఃపుర స్త్రీలూ చేరకుండా ఆజ్ఞాపించు. ఆయన వీరందరి గోడూ వింటూ అవస్థ పడ లేడు - అన్నాడు.

రథాలు పితామహుని శరతల్పానికి అల్లంత దూరంలో ఆపి అందరూ పాద చారులై వెళ్ళి ఆ వృద్ధ మూర్తికి నమస్కారాలు చేశారు.

అప్పటికే అక్కడకు చేరి వున్న మునులకూ, ఋషులకూ అభివాదాలు చేసిన అనంతరం వాసుదేవుడు :

కురు వంశ శేఖరా! ఇప్పుడు నువ్వు ఈ ధర్మ నందనునికి పరమ ధర్మాలు విశదం చెయ్యాలి, అనగా నవ్వుతూ భీష్ముడు : వాసుదేవా! పరిహాసమా యిది! కాకపోతే నువ్వుం డగా నేను ధర్మోపదేశం చెయ్యడమా - అన్నాడు.

పితామహా! కీర్తిని మూట గట్టుకోవాలనే కాంక్ష నాకు లేదు. సర్వ ధర్మాలూ నీ ముఖాన వినిపించి నీ యశో దేహం త్రిలోకాలలో విహరింప చేయాలని నా కోరిక - అన్నాడు దేవకీ నందనుడు.

గురు సమక్షంలో శిష్యుడు పాఠ ప్రవచనం చేసి నట్లుంటుంది నేను నీ యెదుట మాట్లాడడం. అని మంద హాసం చేశాడు మందాకినీ నందనుడు.

నీ మహానుభావత్వం ఒక్కమారు నీ మనుమలూ యిక్కడ చేరిన మిగిలిన రాజులూ తెలుసు కోవాలని నా వాంఛ అన్నాడు మురారి.

గాంగేయుడు చేయి జాపి ధర్మరాజును దగ్గరగా తీసుకొని : నాయనా! నీ సందేహాలు అడుగు, అనగా ధర్మరాజు : తాతా! మిమ్ము చూస్తుంటే ఏమి అడగాలో తెలియడం లేదు మాకు ఏవి అవసరమో అవి మీరే చెప్పండి, అని వినయంగా తలవంచాడు.

నాయనా! రాజ్యపాలనం కత్తిమీద సాము వంటిది. నువ్వు క్షమా శీలంతో వుంటే మావటీడు మత్తేభం మీది కెక్కి అంకుశ ప్రహారం చేసినట్లు ప్రజలు ప్రభువు మీద పెత్తనం చేస్తారు. నువ్వు మరీ క్రూరంగా వుంటే క్రూర మృగాన్ని హింసించినట్లు హింస పెడతారు.

అందుచేత వసంత ఋతువులో సూర్యునివలె చురుక్కు మనిపించి చల్లదనం యివ్వాలి. ఆ ఋతువులో ఎండ చురుకు తగ్గితే మళ్ళీ వానలుండవు కదా! అదీ దాని తాత్పర్యం.

గర్భవతి అయిన స్త్రీ తన లోపలి బిడ్డ ఆరోగ్యం మనసులో వుంచి, ఆహార విహారాలు సాగించేటట్లు ప్రభువు ప్రజల కష్ట సుఖాలు ఎరిగి చరించాలి. రాజ్య పాలనకూ, ధర్మ సాధనకూ అవశ్యమయిన అర్థాన్ని అతి చాక చక్యంతో ఆర్జించాలి. పులి పిల్లలను తిన్నట్లు ప్రజలను పన్నుల పేరిట ఒక్కసారి కబళించ కూడదు. పశువు శరీరం మీద చేరిన జలగలా ఎప్పటి కెంత అవసరమో అంతంత గ్రహిస్తూ ఉండాలి.

ఏమయినా సరే ప్రజాభిమానం కోలుపోకూడదు. సేవక గణాన్ని వంచించ కూడదు. వారికి మనసు తెలియనివ్వకుండా వారి రక్షణ భారం వహించాలి.

ఇంద్రియాలను నిగ్రహించాలి. పాము కుబుసం విడిచినట్లు కోరికలను విసర్జించాలి. ఆశ్రితులలో అమాత్యులలో నీ వారెవరో విద్వేషు లెవరో గ్రహించాలి.

నాయనా! అన్నిటినీ మించినది ఆ పర తత్త్వం. దాన్ని మనస్సులో ప్రతిష్ఠించు కొని మన కర్తవ్యం మనం నిర్లిప్తంగా సాగించి పరమ పదం చేరడానికి ప్రయత్నించాలి — అని భీష్ముడు అనేకానేక ధర్మ సూక్ష్మాలు వివరించాడు.

శాంతి పర్వం సమాప్తం

# ఆనుశాసనికపర్వం

ఉషో రాగాలు ఉదయాచలాన విహరించే వేళ ధర్మరాజు విధ్యుక్త కర్మలు నిర్వర్తించి వాసుదేవునితో తన సోదరులతో భీష్మ పితామహుని సమీపించి పాదాభివాదం చేసి :

సర్వధర్మ మర్మజ్ఞా! ఎన్నెన్నో ధర్మ సూక్ష్మాలు మీ ముఖాన విన్నాను. అయినా నా మనస్సు ఉపశాంతి పొందటం లేదు : నానాదేశాధీశులను వధించాను. ఆత్మీయులను, గురువులను, ఆప్తులను సంహరించాను. ఈ హింసా కాండ నా మనస్సును వేధిస్తున్నది. దుర్యోధనుని లోభం నా కాగ్రహం కలిగించింది. దానితో యింత ఘాతుకం సాగింది—అనగా నవ్వి ఆంబికేయుడు.

ధర్మనందనా! ఎవరి మరణానికీ ఎవడూ కర్తకాడు. వాడి కర్మ ఫలం వాణ్ణి అలా తీసుకు పోతుంది. అంతే! దాని కోసం విచారం దేనికయ్యా! దేనికయినా దైవమూ పురుష ప్రయత్నమూ అని రెండు వుంటాయి. ఇందులో దైవం. బీజం, మానవ ప్రయత్నం-క్షేత్రం క్షేత్రం చవుడుదయితే బీజం ఫలించదు కదా! మరొక్కమాట, మానుష ప్రయత్నమనే కర్మ జరగకుండా బీజం ఫలించదు సుమా! నేలను బాగా దున్ని పదును చేసి నీరు పెడితేనే బీజం ఫలించేది. మహామహు లందరూ అనుసరించిన ధర్మపథాన నీ కర్మ నువ్వు చేస్తేనే ఫలం లభించేది.

దేన్ని మనం ఆశ్రయించుకొని వుంటామో దాన్ని ఎప్పుడూ విడవకూడదు. వేద వేద్యుడయిన పరమ పురుషుని ఆరాధిస్తూ ఆయన అనుగ్రహం పొందడానికి నిరంతరం కృషి చెయ్యాలి.

ఎప్పుడూ శుచిగా వుంటూ, నిత్యం సత్యం పలుకుతూ, సోమరి కాకుండా నిరంతర వ్యవసాయం సాగిస్తూ, విద్యాజ్ఞానం సముపార్జించి, దాన ధర్మాలతో అందరినీ తృప్తి పరుస్తూ, సత్కర్మలు చేసేవారి యింట లక్ష్మి శాశ్వతంగా వుంటుంది.

కృతఘ్నుడూ, క్రూరుడూ, నాస్తికుడూ లక్ష్మికి శత్రువులు. వీరే కాదు నిరంతరం భర్తకు ఎదురు చెపుతూ, గయ్యాళియై, ఎల్లవేళలా — యిరుగు పొరుగు యిళ్ళల్లో వుంటూ, వీలు చిక్కినప్పుడల్లా చెంగు పరచి నిద్రకు వాలే యిల్లాలున్న యింట్లో లక్ష్మి నిలబడదు ధర్మనందనా!

తాతా! అర్థ విషయం చెప్పారు కనక కామ విషయం కూడా విశదం చేయండి, అని ధర్మరాజు వినయంగా ప్రశ్నించాడు.

నాయనా! కామ సేవనంలో స్త్రీకి కలిగే సుఖం పురుషుడికి ఉండదు. అయితే కామ వశ చిత్తయైన స్త్రీకి యుక్తా యుక్త విచక్షణ వుండదు. ఆ సమయంలో ఆమె చెయ్యని సాహసం ఉండదు. అందు చేతనే ఆ విషయంలో నిగ్రహం వున్న స్త్రీని పతివ్రతగా ఆరాధించాలి.

ఇక దానం విషయం - అయినవాడూ, కానివాడూ దానానికి అర్హుడు కాడు. శ్రద్ధతో వేద విద్య నభ్యసించి, విధ్యుక్త కర్మ లాచరించే ధర్మ పరునికే దానం చెయ్యాలి.

వేద, పురాణ శాస్త్ర పఠనం చేసినా, ఉత్తమ వంశంలో జన్మించినా ప్రయోజనం లేదు. మనిషికి అన్నిటినీ మించినది శీలం. శీల హీనుడికి ఇహ పరాలలో సుఖ సంతోషాలు లేవు. అలానే పతివ్రతయైన భార్యవల్ల లోకంలో పురుషుడు ఖ్యాతి పొందుతాడు.

ఇక కన్యా పాణి గ్రహణం వున్నదే అది అయిదు మార్గాల కనిపిస్తున్నది. అందులో కన్యయొక్క వయో రూప కుల శీలాలకు తగిన విద్యా సంపన్నుని తీసుకొని వచ్చి బిడ్డను దానం చేయటం బ్రాహ్మవివాహం.

కన్య తనకు తానై పురుషుని యందు మనసు లగ్నం చేస్తుంది. ఆ యువకుడు ఆమె యందు రాగంతో వుంటాడు. వారి బంధాన్ని క్షాత్ర వివాహం అంటారు. కంటితో చూసి మన సుతో మనసు కలిపిన యువకునితో జరిగేది గాంధర్వం. ఇక ధనానికి బిడ్డను అమ్మటం ఆసురం. దీనిపైన రాక్షస వివాహం వున్నది. కన్యయొక్క బంధుజనాన్ని హింసించి పిల్లను బలవంతంగా తీసుకు వెళ్ళడమే రాక్షసం. ఈ అయిదింటిలో బ్రాహ్మ, క్షాత్ర, గాంధర్వాలు శ్రేష్ఠాలు.

ఇక కొడుకుల విషయం విను: ధర్మబద్ధంగా వివాహమాడిన స్త్రీకి కలిగినవాడు ఔరసుడు. తన కుమార్తె కొడుకు దౌహిత్రుడు. సజ్జను డయిన పురుషుని వల్ల తన నియో గంతో కలిగినవాడు క్షేత్రజుడు. తనకు సంతానం లేనప్పుడు నచ్చిన వానిని దానంగా తెచ్చుకుంటే వాడు దత్తుడు. తల్లిదండ్రులకు దూరుడై తిరిగే వానిని చేరదీసి పెంచుతాం. వాడు కృత్రిముడు. ఒకానొక స్త్రీకి పర పురుషుని యందు కలిగినవాడు, ఆ తండ్రి యెవడో తెలియనివాడు గూఢజుడు. తల్లిదండ్రులు యింటినుండి తరిమి వేస్తే వచ్చి మన యింట చేరుతాడు, వాడు అపవిద్ధుడు. పెండ్లికి ముందే పితృగృహంలో కుమారుని కంటుంది. వాడు కానీనుడు. గర్భవతి అని తెలిసి కాని తెలయక కాని పెళ్ళి చేసుకుంటాడు. ఆ అమ్మాయి యిక్కడకొచ్చి ప్రసవిస్తుంది వాడు సహోఢుడు.

భర్తను విడిచి కాని విడువబడి కాని భర్తృహీన కాని ఎవరివల్ల నయినా సంతా వతి అయితే అది వాడి సంతానమే. వానిని పునర్భవు డంటారు. ఒక్కొక్కప్పుడు త దండ్రులు వదిలేసినా, వారిని వదలి వీడే వచ్చి తనను పుత్రుడుగా స్వీకరించమని అర్థించి వాడు స్వయందత్తు డవుతాడు. తల్లిదండ్రులకు ధన మిచ్చి తెచ్చుకుంటే క్రీతు డంటా( వీరందరూ కూడా కర్మ చెయ్యడానికి అర్హులే కాని ఔరసుడే అందరిలో శ్రేష్ఠుడు.

నాయనా! అన్ని దానాలలో భూదానం సర్వోత్తమం. శాంత చిత్తంతో జీవిస్తు యజ్ఞ యాగాది క్రతువులూ, సత్కార్యాలు చేసే విద్వాంసుని మనంతట మనం పిలి భూదానం చెయ్యాలి. ఈ భూమి రత్న గర్భ కనక భూదానం వల్ల సర్వ రత్న మణి సువ దానాలు చేసిన ఫలం లభిస్తుంది.

అంతకంటె పరమోత్కృష్ట మయినది అన్నదానం. ఆకలి గొన్న వాడికి కడుపు నిం( భోజనం పెట్టడం కంటె పుణ్య కార్యం భువిలో లేదు నాయనా!

గురువు కంటె తండ్రి అధికుడు. తండ్రి కంటె తల్లి అధికురాలు. అన్న గా తండ్రితో సమానుడు. వదిన మాతృసమానురాలు. ఉపవాసాలూ, ఏకభుక్తాలూ, దేహ ఆరోగ్యంగా వుండడానికి వినియోగ పడతాయి. ఉపవాస దీక్షతో తపస్సు చేసినవా శతాయువులు అవుతారు.

మనస్సును ఏకాగ్రం చేసి, ఇంద్రియా లన్నిటినీ అదుపులో వుంచి వేద విద్య అభ సించి, చిత్త శుద్ధితో పరంజ్యోతిరుపాసన చేసేవారికి సర్వోత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి – అ అనేకానేక యితిహాసాల ప్రమాణాలతో ధర్మ సూక్ష్మాలు విశదం చేశాడు గాంగేయుడు.

అప్పటికి మనస్సు స్వస్థమై ధర్మరాజు హస్తి నాపురం చేరి ధర్మ బద్ధంగా రాజ్య పా నం చేయడం ప్రారంభించాడు.

రోజులు గడిచాయి

ఉత్తరాయణ పుణ్యకాలం సమీపించింది. ధర్మరాజు బంధు జనంతో భీష్ముని దగ్గర( వెళ్ళి దోయిలించాడు.

అప్పుడు భీష్ముడు హర్ష పులకిత చిత్తంతో అందరి అనుమతి తీసుకుని, వాసుదేవు మీద చూపులు నిలిపాడు. ఆ యోగిజన హృన్నివాసి మందహాసంతో గాంగేయుని చూశాడు భీష్ముడు వాయువును బంధించాడు. అంతే, ఆ ఆత్మజ్యోతి అనంతంలోకి సాగిపోయింది. ఆయ శిరస్సు భిన్నమై దివ్యకాంతి గగన ముఖంగా వెడుతూంటే అందరూ ఆశ్చర్యంతో నిలబడ్డార

ధృతరాష్ట్ర, ధర్మనందన, నకుల, సహదేవులు ఆ పరమ ధర్మమూర్తి దేహాన్ని శ్మశానానికి తెచ్చారు. విధ్యుక్త రీతిని అగ్ని సంస్కారంచేసి, గంగా తీరాన నివాపాంజలులు ఇచ్చి, వేడి నిట్టూర్పులతో వెను దిరిగి చూస్తూ నగరానికి చేరారు.

అనుశాసనిక పర్వం సమాప్తం



# అశ్వమేధ పర్వం

సర్వలోక వంద్యుడయిన భీష్మ పితామహునికి ఉత్తర క్రియలు నిర్వర్తించి, ధర్మరా
విషాద భర హృదయుడు కాగా, వాసుదేవుడు కొన్ని ఉపశమన వాక్యాలు పలికి ఓదార్చా
అప్పుడు ధృతరాష్ట్రుడు : ఇదంతా నా మూర్ఖత్వం వల్ల వచ్చి పడింది అని విలపించ
మొదలు పెట్టగా కృష్ణుడు :

మామా ! మరణించిన వారి కోసం మనం ఎంత శోకించినా వారు తిరిగి రారు, ర
పోగా యీ శోకం వారికి పుణ్య లోకాలు లేకుండా చేస్తుంది, అని శాంతింప జేశాడు.

అప్పుడు ధర్మరాజు : బావా ! ఇంతవరకు మీ మాట ప్రకారం నడిచాను.
నాకు వనవాసానికి ఆజ్ఞ యివ్వండి. పితామహుడయిన భీష్మునీ, అగ్రజుడయిన కర్ణు
చంపించిన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు – అని దీన చిత్తుడయాడు.

నవ్వు రాజిల్లెడి మోము వా డపుడు : ధర్మనందనా ! ఇన్ని రోజులుగా యింద
చెపుతున్న తత్త్వ విషయాలూ పొల్లుపోయి నట్లేనా ! చాలు చాలు ఇదంతా నువ్వు చేశానం
వేమిటయ్యా ! అసలు నువ్వెవడివి ! సర్వానికీ కర్త ఆ ఈశ్వరుడు. ఎప్పుడూ మరచిపో
ఈ మాట.

మనశ్శాంతి కోసం, అశ్వమేధ యాగం చేసి విద్వాంసులనూ దేశ ప్రజలన
వివిధ దానాలతో తృప్తి పొందించు, అన్నాడు

ధర్మరాజు : మాధవా ! అశ్వమేధం, సువర్ణ, ధనరాసులుంటే గాని సాగేది కాద
ఇప్పు డిందరు రాజులను సంహరించాం. వీరి రాజ్యాలకు వెళ్ళి సుంకం అడగటం న్యాయ
కాదు. ఇంతకు ముందే దుర్యోధనుడు మామీది కోపంతో దుండగులను వదిలి దోపిడీ
జరిపి కోశాగారం అంతా బూడిదచేశాడు. ఇప్పుడు ఎక్కడుంది ధనరాశి, అని ప్రశ్నించాడ
విన్న వ్యాసమహర్షి :

ధర్మనందనా ! పూర్వకాలం మరున్మహారాజు యజ్ఞం సాగించి అక్షయ ధనరాసు
దక్షిణలుగా ఇచ్చాడు. వేద విదులు ఆ రాసులు ఏం చేసుకోవాలో తెలీక పాతులు పె
అవి ఎవరి కంట బడితే వారివే అని నియమం చేశారు. అవి హిమగిరి ప్రాంతంలో వున్న
అని మరున్మహారాజు కథ విశదం చేశారు.

ధర్మరాజు వారందరికీ నమస్కరించి యాగదీక్షకు అవసరమయిన సంభారాలు సమకూర్చే ప్రయత్నం ఆరంభించాడు.

ఆ రోజులలో కృష్ణార్జునులు సముచిత పరివారంతో విలాస యాత్రగా యింద్రప్రస్థం వెళ్ళి అక్కడ మయసభలో వుంటూ ఎన్నెన్నో స్మృతులు మననం చేసుకుంటూ కొన్నాళ్ళు గడిపారు.

ఒకనాడు వాసుదేవుడు : బావా! ఇంక నేను మా నగరం వెళ్ళాలి. మా జననీ జనకులనూ, అగ్రజుడయిన బలరామునీ, యితర బంధు కోటినీ చూడాలని వుంది.

అనగా అర్జునుడు : మనం హస్తినాపురం వెళ్ళి ధర్మరాజు అనుమతి పొందుదాం, అన్నాడు.

వచ్చిన కృష్ణార్జునులను చూసి ధర్మరాజు సంతోషచిత్తుడై, ద్వారకకు పోనున్న వాసుదేవునితో :

రుక్మిణీ వల్లభా! నీ దయవల్ల మేము యిప్పటికీ స్థితికి చేరాం, అశ్వమేధం కూడా నిర్విఘ్నంగా నువ్వు దగ్గరుండి చేయించాలి, అని అర్థించగా చిరునవ్వుతో అంగీకరించి, ధృతరాష్ట్ర, గాంధారీదేవుల వద్ద సెలవు తీసుకుని, కుంతీదేవి అనుమతితో సుభద్రను వెంటబెట్టుకుని సాత్యకి సహితుడై ద్వారక చేరాడు, వాసుదేవుడు.

చిరకాలానికి వచ్చిన వాసుదేవునికి సముచిత మర్యాదలు జరిపి ఉత్సవం చేసుకున్నారు యాదవులు.

విశ్రాంతివేళ వసుదేవుడు :

నాయనా! యుద్ధవిశేషాలు కొన్ని విన్నాను కాని, నీ ముఖాన విశదంగా వినాలని వుంది, అన్నాడు.

వాసుదేవుడు సంగ్రామ కథ సమగ్రంగా వినిపిస్తూ, అభిమన్యుని ప్రస్తావన రాకుండా చేశాడు.

వింటున్న సుభద్ర : అన్నయ్యా! నీ మేనల్లుడి మాట వదిలేశావుగా అంది, శోక సంతప్త హృదయంతో మూర్ఛపోతూ.

అందరూ సుభద్రకు శీతలోపచారాలు జరిపి, మూర్ఛ తేర్చాక కృష్ణుడు అభిమన్యుని పరాక్రమ గాథ రమణీయంగా వినిపించాడు. అందరూ విషాదభరహృదయు లయారు.

* * *

అక్కడ హస్తినాపురంలో ధర్మరాజు, సత్యవాక్పాలనంతో ధర్మం పీడకుండా ఏలుబడి నడుపు తున్నాడు.

ఆ రోజులలో ఒకనాడు వ్యాస మహర్షి విజయం చేసి అశ్వమేధ యాగం సాగించమని తొందర చేశాడు. ధర్మరాజు అందుకు అవసరమయిన ధన కనకరాసులు తీసుకురావడానికి తమ్ములతో సైన్యంతో బయలుదేరుతూ యుయుత్సుని నగరరక్షణ వ్యవహారంలో వుంచి, అతనికి తోడుగా విదురుని ఆపాడు.

పరివార సమేతంగా ధర్మరాజు బయలుదేరే వేళ, మంగళ వాద్యాలతో వేదాశీస్సులు మిన్నుముట్టాయి.

పురోహితులు ధౌమ్యులు ఆదేశించిన ప్రకారం సర్వ కార్యాలూ నిర్వర్తించి, సర్వేశ్వరుడూ, నిఖిల నిధానపతీ అయిన పశుపతిని ఆరాధించి, పారాశర్యుని నిర్దేశానుసారం పరిజనంచేత త్రవ్వకం సాగించాడు.

కొంత లోతు త్రవ్వేసరికి కనులు మిరుమిట్లు గొలిపే కాంతులతో మణి, సువర్ణ రాసులు గోచరించాయి. ఆ నిధికి యథావిధి పూజలు జరిపి, దానిని ఏనుగులమీద, రథాల మీద, బండ్లమీద ఎక్కించి హస్తినాపురం బయలుదేరారు.

ధర్మరాజు యాగ ప్రయత్నంలో వున్న వార్త విని వాసుదేవుడు బలరామ, సాత్యకి, కృతవర్మ ప్రభృతి యాదవ గణంతో బయలుదేరి వచ్చాడు.

వచ్చిన బంధువు లందరికీ ఉచిత రీతిని మర్యాదలు సాగుతున్నాయి. యాగానికి అవసరమయిన యితర ప్రయత్నాలు నడుస్తున్నాయి.

అందరూ ఇష్టా గోష్ఠిలో వుండగా ఉత్తర "మృతశిశువు" ను ప్రసవించిందనే వార్త ఆశని పాతంలా వచ్చింది.

అందరి ముఖాలూ వెలవెల బోయాయి. సుభద్ర గోలు గోలున ఏడుస్తూంటే, కుంతీ దేవి కన్నీరు వొత్తుతూ కృష్ణుని చేరి :

నాయనా! గురుపుత్రుడు ప్రయోగించిన అస్త్ర ప్రభావం యింకా మమ్మల్ని వేధిస్తూనే వుంది, అని విలపిస్తూంటే; అన్నయ్యా! నా కొడుకు పోయినా మనవణ్ణి చూసుకుని, ఆ దుఃఖం మరచిపోదాం అనుకున్నాను. నీ మేనల్లుడి కొడు కిడిగో అని చూపించి ఆనందిద్దామనుకున్నాను, అంటూ రుద్ధ కంఠంతో ముఖం వాల్చింది సుభద్ర.

ఉత్తర మాటా పలుకూ లేకుండా స్మృతి హీనయై పడివుంది.

వాసుదేవుడు అందరినీ ఓదార్చి, పాదప్రక్షాళనం చేసి, పవిత్ర జలాలతో అభిమంత్రించి, అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రం ఉపసంహరించి ఆ శిశువును పునర్జీవితుని చేశాడు.

అప్పటికి తెలివివచ్చిన ఉత్తర తనపక్కలో బిడ్డ కదలడం చూసి, పట్టలేని ఆవందంతో శిశువును వాసుదేవుని పాదాల ముందు వుంచింది. దేవకీ నందనుడు చిరునవ్వుతో చెయ్యెత్తి ఆశీర్వదించాడు.

వంశం పరిక్షీణమయే వేళ జన్మించాడు కనక పరీక్షిత్తు అని నామ కరణం చేశాడు.

ఉత్తరకు నెలపురుడు దాటింది.

అశ్వమేధానికి ఉపక్రమిస్తూ వ్యాసుని ఆజ్ఞానుసారం ఉత్తమ జాతి అశ్వాన్ని విడిచి, దాని వెంట అర్జునునీ, వాని వెంట పరిజనంతో వేదవిదులనూ పంపాడు. ధృతరాష్ట్ర, గాంధారీ, కుంతీదేవులకు అన్ని విషయాలూ వివరించి వారి అనుమతి పొందిన అనంతరం ధర్మరాజు.

భీముడూ, నకులుడూ దేశ రక్షణ భారంలో వున్నారు. సహదేవుడు కుటుంబ సేవలో వున్నాడు.

అర్జునుడు అశ్వం వెంట వెడుతూ నానా దేశాలూ తిరిగి, వారందరినీ అశ్వమేధానికి ఆహ్వానిస్తూ ఎదురు తిరిగిన వారిని పరాజితులను చేసి, సింధు దేశం చేరాడు.

అక్కడ సైంధవుని మిత్రుల పుత్రులూ, మనుమలూ ఎదిరించగా వారందరినీ చెల్లాచెదురు చేశాడు. అది విని దుస్సల తన మనుమని చంక నెత్తుకొని వచ్చి : అన్నయ్యా! వీడొక్కడూ మిగిలాడు మా యింటికి, వీణ్ణి రక్షించు – అంది.

అర్జునుడు కన్నీ రొత్తుకుంటూ :

అమ్మాయీ! నీ కొడుకేడీ? అనగా! నువ్వు మా సేనలతో వచ్చి యుద్ధం చేస్తున్నావని విని, అంతకుముందే వాళ్ళ నాన్న నీ చేతులలో నిహతులయారని విన్నాడు కదా! ఆ భయంతో ప్రాణాలు వదిలేశాడు, అని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

అర్జునుడు ఓదార్చి అశ్వమేధానికి తప్పక రావాలని చెప్పి :

చెల్లీ! మా అన్నయ్య దుర్యోధనుడు దురహంకారంతో యింత తెచ్చాడు. అంతకంటె ఆవేశంతో మేము ఈ పాపం చేశాం, అని ఆమెతో కలిసి యింతసేపు ఏడ్చి, వారిని సాగ నంపి, గుర్రం వెంట బయలుదేరాడు.

మణిపూరదేశం చేరగా దాని అధిపతి బభ్రువాహనుడు తన తండ్రి రాకకు సంతోషించి కానుకలు తెచ్చి పాదాభివందనం చెయ్యగా :

అబ్బాయీ ! అశ్వమేధం సాగుతూంటే, గుర్రాన్ని ఆపి, వీరత్వం చూపాలి కాని, యిదేవిటీ అతిథి సత్కారాలు - అని హేళన చేశాడు.

బభ్రువాహనుడు యిల్లు చేరేసరికి అతనిని నాగకన్య ఉలూచి సమీపించి : నాయనా! నేనూ నీకు తల్లివంటి దానినే ! నీ తండ్రికి వీరుడయిన కొడుకుతో పోరాటం సాగించాలని వుంది. వెళ్ళు. ధనుర్విద్యలో నీ కౌశలం చూపి ఆయన మెప్పు పొందు - అంది.

బభ్రువాహనుడు తిరిగి వచ్చి ధనుష్టంకారం చేశాడు.

అర్జునుడు శర సంధానం చేశాడు. ఉభయులూ తమ కౌశలం ప్రదర్శిస్తూండగా ఒక్కక్షణంలో అర్జునుడు ఉక్కిరి బిక్కిరయి : భేష్, ఇంతవరకూ నేను విలాసంగా సాగించాను. ఇంక కాసుకో! అని నిశిత శర వర్షం కురిపించాడు. ఎదుర్కొని బభ్రువాహనుడు విడిచిన వాడి బాణానికి అర్జునుడు వెన్నువంగి నేలకూలుతూ, వదలిన శరాఘాతంతో బభ్రువాహనుడూ మన్ను కరిచాడు.

అటు భర్త, యిటు కొడుకు యిద్దరూ నేల కూలిన వార్త వింటూ చిత్రాంగద ఉలూచిని వెంటబెట్టుకుని విచార స్వాంతయై వచ్చి గోలుగోలున విలపిస్తూ :

ఎందు కిటువంటి పని చేయించావు అని ఉలూచిని ప్రశ్నించగా ఆమె, అర్జునునికి వసువులు శాపం యిచ్చారు. శిఖండిని అడ్డుపెట్టుకుని భీష్ములను పడగొట్టినందుకు ; ఆశాపం తీరాలంటే యీ జన్మలోనే ఒకమారు ప్రాణ హీనుడు కావాలని వినడంవల్ల యీ పని చేశానని సంజీవ మణితో పునర్జీవితుని చేసింది.

అప్పటికే బభ్రువాహనుడు మూర్ఛనుండి లేచి తండ్రికి నమస్కరించాడు.

అర్జునుడు నిద్రనుండి లేచినట్లే నిలబడి, కొడుకును గాఢంగా కౌగలించుకొని చిత్రాంగదనూ ఉలూచినీ ఉచిత రీతిని సల్లాపాలతో ఉల్లసింపజేసి, అందరినీ అశ్వమేధ యాగానికి ఆహ్వానించి, తక్కుంగల దేశాలన్నీ తిరిగి హస్తినాపురం చేరుకున్నాడు.

తమ్ముడు సుఖంగా వస్తున్నాడని విన్న ధర్మరాజు భీముని పిలిచి: తమ్ముడూ! చైత్రపూర్ణిమ దగ్గర పడుతున్నది. యజ్ఞ శాల నిర్మించి అక్కడ మహర్షులకూ రాజులకూ శిబిరాలు వేయించి, మిగిలిన అవసర సామగ్రి అంతా చేర్పించు, అన్నాడు.

నిశ్చయించిన సుముహూర్తంలో యాగదీక్షితు డయాడు ధర్మరాజు.

ప్రాయశ్చిత్త రహితంగా సాగిన ఆ యాగంలో ధర్మరాజు తన సర్వ రాజ్యం వ్యాస మహర్షికి ధారవోశాడు.

అప్పుడు వ్యాసుడు: నాయనా! నీ రాజ్యం నువ్వే గ్రహించు. మా ఋత్విక్కులను సువర్ణ రాసులతో తృప్తి పరచు, అన్నాడు.

లక్షల మంది తృప్తిగా భోజనం చెయ్యగానే మ్రోగే రీతిని ఒక గంట కట్టారు యాగ శాలలో. ఆ ఘంటానాదం యాగం సాగుతున్నంత కాలం నిర్విరామంగా వినిపిస్తూనే వున్నది జనమేజయ మహారాజా! అని వైశంపాయనుడు ఆశ్రమ వాస పర్వం ఆరంభిస్తున్నాడు.

అశ్వమేధ పర్వం సమాప్తం

---

# ఆ శ్ర మ వా స ప ర్వం

రోజులు గడుస్తున్నాయి.

ఋతుచక్రం తిరుగుతున్నది.

సంవత్సరాలు పదమూడు దొర్లి పోయాయి.

గాంధారీ ధృతరాష్ట్రులకు ఏ లోటూ రాకుండా ధర్మరాజు స్వయంగా చూసుకుంటున్నాడు.

ద్రౌపది, సుభద్ర ఉలూచి, చిత్రాంగదలు గాంధారిని దర్శించి, ఆపిడకు ఆశ్వాసన చెపుతున్నారు.

భీముడు మాత్రం సందు చిక్కినప్పుడల్లా ధృతరాష్ట్రునికి వినపడేటట్లు నవ్వుతూ తన ప్రతాపమూ, దుర్యోధనాదుల అక్రమ వర్తనలూ గురించి మాట్లాడుతూ దెప్పి పొడుస్తున్నాడు. ఆ మాటలు విన్నప్పుడు నకుల సహదేవులు సంతోషంతో ఒకరి నొకరు చూసుకునేవారు.

ఆ వంకకు ధర్మరాజు వస్తే ఒకరూ పెదవి కదిపేవారు కాదు. ఆ వృద్ధరాజు ధర్మజుని ప్రవర్తనతో సంతోషాన్ని, భీముని మాటలతో విషాదాన్నీ అనుభవిస్తూ, ఒకనాడు ధర్మరాజునూ యితర కుటుంబాన్నీ రావించి :

నాయనా! ఇంక నాకు యిక్కడ ఈ రాజభోగాల మీద మనసు లేదు. అడవికి పోయి తపస్సు చేసుకోవాలని ఉంది – అన్నాడు.

ఆ మాటలు విన్న క్షణంలో ధర్మరాజు కన్నుల నీరు తిరిగి : ప్రభూ! ఇక్కడ మీకు జరుగుతున్న లోటు ఏవిటి! ఎవరయినా మీ యందు వినయం చూపక తిరస్కారంతో వుంటే చెప్పండి. తక్షణం వారిని దేశ బహిష్కృతుల్ని చేస్తాను, అనగా

ధృతరాష్ట్రుడు ; నాయనా! దుర్యోధనాదుల కంటె మీరే నన్ను ఎక్కువ ఆదరంతో చూసుకుంటున్నారు. నాకు ఏ లోటూ లేదు. నేనే రాజుగా ఉన్నట్లు నడుపుతున్నారు. కాని రాజవంశీయుడు వీరత్వం ప్రదర్శించి సంగ్రామంలో మరణించాలి. లేదా వానప్రస్థం సాగిస్తూ ప్రాణాలు విడిచిపెట్టాలి. పరుల పంచ మంచం పట్టి చావకూడదయ్యా! అన్నాడు.

ధర్మరాజు పరి పరి విధాల అర్థించినా వినలే దాయన, ఆ సమయానికి వచ్చిన పరాశర నందనుడు ధృతరాష్ట్రుని సంకల్పానికి ఎదురు చెప్పవద్దన్నాడు.

ధర్మరాజు తల వంచాడు.

వాన ప్రస్థానికి వెళ్ళేముందు కొన్ని దాన ధర్మాలు సాగించాలన్నాడు ధృతరాష్ట్రుడు. ధర్మరాజు ఆయనకు కావలసిన సామాగ్రి అంతా అందించడానికి ఆజ్ఞాపించాడు.

భీముడు మాత్రం: మన మీద కక్ష గట్టి చచ్చిన వారి కోసం యీయన దాన ధర్మాలు చేస్తే మనమెందుకు ధారపొయ్యాలి, అని అడ్డు తిరిగాడు, అర్జునుడు మెత్తని మాటలతో ఓదార్చాడు.

వీర స్వర్గం అలంకరించిన అందరికీ ఉత్తమ గతులకు అవశ్యమయిన భూ, సువర్ణ, అగ్రహార- గో దానాదులు జరిపి ఒకనాడు విశ్రాంతిలో ఉండగా గాంధారి సమీపించి: ఇంకా ఎంతకాలం యిక్కడ గడపడం, అంది

ధృతరాష్ట్రుడు మరునాడే పౌర, జానపదులందరి దగ్గర సెలవు తీసుకుంటూ:

ఆర్యులారా! శంతన మహారాజు మీ అందరి అభిమానంతో ఈ రాజ్యాన్ని పాలించాడు. అనంతరం భీష్ముల వారి రక్షణలో విచిత్రవీర్యుడు ఈ రాజ్యాన్ని ధర్మపరుడయి పాలించాడు. తదుపరి మా తమ్ముడు పాండురాజు మీ అందరి ఆదర గౌరవాలు పొందుతూ సింహాసనం ఎక్కి మీ యోగక్షేమాలు చూసుకున్నాడు. ఇప్పుడీ ధర్మరాజు యింతకాలంగా మీ అందరి కష్ట సుఖాలలో భాగస్వామియై ఈ వంశ ప్రతిష్ఠ పెంపొందిస్తున్నట్లు మీ రందరూ చూస్తూనే వున్నారు. శంతన, విచిత్రవీర్య, పాండురాజాదులను చూసినట్లే యీ ధర్మజుని కూడా మీ రంతా అభిమానంతో చూడండి. నే నింక వనవాసం చేయడానికి వెడుతున్నాను. మీ అనుజ్ఞ యివ్వండి అన్నాడు.

వారందరూ కన్నీరు మున్నీరుగా విలపిస్తూ: ప్రభూ! మీరు హస్తినాపురి విడవ నవ సరం లేదన్నారు.

ధృతరాష్ట్రుడు పరి పరి విధాల వారిని బతిమాలి ఒప్పించి, వనవాసానికి సాగుతుంటే గాంధారి, విదురుడు, సంజయుడు అనుసరించారు.

ఆ క్షణంలోనే కుంతి: ధర్మనందనా! ఇంక నేనూ వారితోనే వెడుతున్నాను. పెద్ద బావగారికీ, అక్కకీ, సేవ చేసి కాలక్షేపం చేస్తాను, అంది.

పాండవులూ వారి భార్యలూ కూడా ఆవిడ నిర్ణయానికి నిర్విణ్ణులయి కాళ్ళమీద పడి, కదలవద్దని పట్టు బట్టారు.

వినలేదు కుంతి. ధర్మరాజునే చూస్తూ :

నాయనా! నా నిర్ణయానికి తిరుగు లేదు. నువ్వు మాత్రము కర్ణుణ్ణి మరచిపోకు. నా ఖర్మ కాలి వాణ్ణి చేజేతులా చంపించు కున్నాను. అది నా గుండెను దహిస్తూనే వుంది. మరొక మాట సహదేవుడంటే నాకు పరమ ప్రీతి. వాడి విషయం నువ్వే స్వయంగా చూసు కోవాలి అంది.

అందరూ నగరం పొలిమేరల వరకూ సాగి వచ్చాక, ధృతరాష్ట్రుడు వారందరినీ వెను దిరిగి వెళ్ళమని కురుక్షేత్రాభిముఖంగా నడచి శతయూప రాజర్షి ఆశ్రమం దగ్గర కుటీరాలు వేయించాడు.

రోజూ వృద్ధు లుభయుల అవసరాలు కనిపెట్టి సమకూరుస్తున్నది కుంతి. సంజయుడు అందరినీ గౌరవంతో చూస్తున్నాడు.

విదురుడు మాత్రం అన్నహారాలు విడిచి పవిత్ర జలాలు పుచ్చుకుని, గాలినే ఆహా రంగా తీసుకుంటూ గడుపుతున్నాడు.

అలా సంవత్సరాలు గడిచాయి.

ఒకనాడు ధర్మరాజు తన ఆప్తులతో మాట్లాడుతూ! ఒక్కమారు వెళ్ళి ధృతరాష్ట్ర, గాంధారీ విదుర సంజయులను చూసి రావాలని వున్న దన్నాడు.

తక్షణం సహదేవుడు: అన్నయ్యా! చాల రోజులుగా నాకు అమ్మను చూడాలనే కోరిక వుంది – అంటూ కంట తడి పెట్టాడు.

అందరూ బయలు దేరారు అడవికి. వచ్చిన వారందరి కుశల ప్రశ్నలూ ముగిశాయి.

వెడుతూనే సహదేవుడు కుంతి ఒడిలో తల వంచుకుని పడుకున్నాడు. కుంతి వాని వెన్ను నిమురుతూ కన్నులు వొత్తుకుంది.

అప్పు డక్కడికి వచ్చిన వ్యాసుడు వారందరినీ గంగాస్నానం చేయించి, మరణించిన వీరు లందరినీ చూపించాడు. ఆశ్చర్యం ఆనందం వారిని పెనవేసు కున్నాయి.

ఆ రోజులలో – ఒకనాడు అడవికి వెళ్ళిన విదురుడు రెండు రోజు లయినా తిరిగి రాలేదు. ధర్మరాజు వెతకడానికి వెళ్ళి, ఒక చెట్టు క్రింద నిశ్చలంగా నిలబడ్డ విదురుని చూసి :

